# మణిమాల

## వివిధ కావ్యాలలోని సుభాషితాలకు వ్యాఖ్య



వ్యాఖ్యాత

డి. యన్. దీక్షిత్

# MANIMALA

By D. N. DEEKSHIT
1990
Published with the financial assistance of
T. T. Devasthanams.



Copies  1000

Price : Rs. 10/-

Cover design . G. Daniel, Vijayawada

Copies can be had from :

D N. DEEKSHIT, M. A ,
Lecturer in Sanskrit,
Hindu College
Guntur - 522003.

Printed at :

Phone 30537
Sripathi art printers
4/7 Brodie pet,
Guntur - 2.

# దీధితి

ప్రొఫెసర్ ఎస్. బి. రఘునాథాచార్య
సంస్కృత విభాగం,
శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయం,
తిరుపతి.

సుందరమైన సుభాషితం అందరికీ ఆనందాన్ని పంచుతుంది. అలా అలా సహృదయ హృదయాంతరాల్లో ఎన్నో వసంతాలు నివసిస్తుంది. అవును! అది అనుభవ క్షీరసాగరంలో ఆవిర్భవించిన అమృతకలశం. అందుకే గోచరించిన వెంటనే శాంతిసుధలను మన అంతరంగాలపై వెదజల్లుతుంది. నిజమైన రత్నం సుభాషితమే అనటం అతిశయోక్తి కానేకాదు. అందుకే ఒక మహాకవి ఇలా అంటాడు-

పృథివ్యాం త్రీణి రత్నాని
జలమన్నం సుభాషితమ్ ।
మూఢైః పాషాణఖండేషు
రత్నసంజ్ఞా విధీయతే ॥

అంత విలువైన రత్నాలను ఎంతగానో గాలించి శ్రీ డి. ఎస్. దీక్షిత్ ఈ మణిమాలను పొందికగా కూర్చాడు. లలితలలితమైన ఈయన వ్యాఖ్యానశైలి మధురంగా మనోహరంగా ఉంది. సమాజంలో అన్నిరంగాలలో ఉన్నవారికి ఈ మణిమాల కర్తవ్యాన్ని ఉపదేశిస్తుంది. ఆపదలో అభయ

మిస్తుంది. అశాంతిలో ప్రశాంతిని ప్రసాదిస్తుంది. ఆనందంలో అవధులను చూపిస్తుంది. అంధకారంలో అందుబాటైన మంచి మార్గాన్ని సూచిస్తుంది.

ఇంతమంచి శీర్షికలను ఎన్నుకొని తగిన సుభాషితాలను కూర్చుకొని రమణీయంగా వ్యాఖ్యానించిన వర్ధిష్ణువు శ్రీ దీక్షిత్‌ను హార్దంగా అభినందిస్తున్నాను. ఇలాగే సంస్కృత సాహితీ సౌరభాలను సహృదయుల కందించి ముందు ముందు కూడా ఆంధ్రుల అభినందనల నందుకోగలడని ఆశిస్తున్నాను.

సత్యమ్ — రఘునాథాచార్య
25-11-1989

# ప్రమోదం

"సాహితీ సార్వభౌమ"
డా॥ ప్రసాదరాయకులపతి
తెలుగు శాఖాధ్యక్షులు
హిందూకళాశాల, గుంటూరు.

యువకవి, విద్వాంసుడు అయిన దీక్షిత్ రచించిన రసభావఘృణీ రమణీయమైన మణిమాల చూచాను విలువ కట్టలేని మణులే అన్నీ కూడా. మహర్షులు, మహాకవులు రచించిన అద్భుతమైన శ్లోకాలను, పద్యాలను ఏరి వాటికి చక్కని వ్యాఖ్యానాన్ని కూర్చి శ్రద్ధాసక్తులతో సరస్వతీ వరివస్య కావించాడు రచయిత. శ్లోకాలు ఏరుకోవటంలో ఎంత శ్రద్ధ, జాగ్రత్త తీసుకున్నాడో వాటికి రచించిన వ్యాఖ్యాన వాక్య నిర్మాణంలోనూ అంత శ్రద్ధ చూపించాడు. అలంకార సుందరమైన, మనోహరమైన పదగ్రథనము ఈ గ్రంథానికి భూషణంగా అలరారుతున్నది.

"అప్పుడప్పుడు నిట్టూర్పుల శిశిరంలో వాడిపోయే జీవనలతను చిగురింపచేసే సన్నని కోకిల కూజితం ఆశ"- ఇటువంటి వాక్యాలలో రచయిత భావుకత, వాక్యనిర్మాణ దక్షత, వ్యక్తమవుతున్నవి.

ఈ రత్న గ్రథనంలో చేరిన శ్లోకాలు, పద్యాలు ధర్మ ప్రబోధకములు, నీతి ప్రచోదకములు, సౌందర్య దర్శకములు, అనుభూతి ప్రదములు అనే నాలుగు రకాలుగా కనిపిస్తున్నవి.

సత్యము, నిత్యము అయిన ధర్మం నీతిగా అభివ్యక్తమయ్యే టప్పుడు దాని పరిణామము ఏ రకంగా ఉంటుందో "ప్రాణహాని వచ్చు పట్టున...." అనే తిక్కన పద్యానికి చేసిన వ్యాఖ్యలో స్పష్ట మవుతోంది. హింస - అహింస, సత్యం — అసత్యం, వాగ్దాన పాలనము మొదలైన ధర్మ భావనలను కాలతత్త్వానికి అన్వ యించటం చేతకాక చాలామంది పొరపాట్లు చేశారు. అటువంటి అయువుపట్టులైన విశేషాలు కొన్ని అక్కడక్కడ కనిపిస్తూ ఉన్నవి.

"సహసా విదధీత న క్రియాం ...." అనే భారవి శ్లోకానికి ఇచ్చిన వివరణ అందంగానే ఉంది. ఐతే ఆ శ్లోకం భారవి జీవితంలో ఏ విధంగా అన్వయించిందో ప్రసిద్ధమైన ఆ కథను కూడా చెప్పివుంటే ఇంకా బాగుండేది. ఈ విధంగా చెబుతూపోతే ఎంతైనా చెప్పవచ్చు ఉపన్యాసాలు చెప్పేవాళ్ళకు, పండిత గోష్ఠులలో పాల్గొనేవాళ్ళకు, అయా గ్రంథాలలోని మంచి పద్యాలు వెతికి చదువుకుందామనుకొనే భావుకులకు ఈ పుస్తకం ఎంతగానో పనికి వస్తుంది. ఇటువంటి సంకలనం కూర్చినందుకు దీక్షిత్‌ను మనసారా అభినందిస్తున్నాము.

# సం ష ము

"జీర్ణమంగే సుభాషితమ్"

మంచిని బోధించవలసిన వారంతా మత్సరగ్రస్తులైతే, అధికారులు గర్వాంధులైతే, మిగిలిన వారంతా బోధలు లేక అక్రమప్రవర్తనులైతే యిక సుభాషితం గొంతులోనే శిథిలమైపోక యేమౌతుంది ?

అందుకే యీ లఘుయత్నం.

వివిధ కావ్యాల్లో ఒదిగిన సుభాషితమణుల్ని ఒక మాలగా గుది గ్రుచ్చి వాటి వెలుగుల్ని సరళవ్యాఖ్యలో తరళితం చేయటమే యీ కృతిలక్ష్యం.

చాలా సుప్రసిద్ధమైనవీ, ఎక్కడైనా ఉట్టంకించడానికి అనువైనవీ అయిన శ్లోకాల్ని మాత్రమే తీసుకొని వివరించాను. రెండు తిక్కనపద్యాలు కూడ గుబాళించాయి. ప్రతిపదార్థ జిజ్ఞాస పాఠకులకు సహజం అందుకే ప్రతిశ్లోకానికి పదార్థవివేచన జరిగింది.

వాల్మీకి నుంచి జగన్నాధ పండితరాయలు వరకు వివిధ సంస్కృత కవులు విభిన్నకోణాల్లో నుంచి జీవితాన్ని పరిశీలించి పలికిన పసిడిమాటల తోరణమిది. హితవచనాభిలాషులైన అందరూ దీన్ని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

గుంటూరు
10-1-1990

డి. యన్. దీక్షిత్

ఈ పుస్తక ప్రచురణకు ఆర్థిక సహాయ మందించిన
తిరుమల - తిరుపతి దేవస్థానము వారికి,
ఈ రచనకు నన్ను ప్రేరేపించి ప్రతినెలా "భారతీయ
మార్గం"లో ప్రచురించిన
శ్రీ మన్నవ గిరిధరరావు గారికి
ఈ చిన్నారి కృతిని అభినందించి ఆశీర్వదించిన
డా॥ ప్రసాదరాయకులపతి గారికి
ప్రొఫెసర్ S.B. రఘునాథాచార్య గారికి
నా శ్రేయోభిలాషులు, V.G.S. పబ్లిషింగ్ సంస్థ అధినేత
శ్రీ శిరం రామారావు గారికి
ముచ్చటగా ముద్రించిన శ్రీపతి ఆర్ట్ ప్రింటర్స్ వారికి,
ముఖపత్రాన్ని రూపొందించిన మిత్రులు శ్రీ డేనియల్
గారికి

సవినయంగా

ధన్యవాదాలు

## వరుసగా ....


| | | |
|---|---|---|
| 1) | హితం | 1 |
| 2) | ఏది మార్గం ? | 3 |
| 3) | పండితుడు | 5 |
| 4) | జీవనరాగం | 6 |
| 5) | అరుదైన గుణాలు | 8 |
| 6) | మాట విలువ | 10 |
| 7) | కార్యశూరులు | 12 |
| 8) | జాగరూకత | 14 |
| 9) | సారగ్రహణం | 16 |
| 10) | స్నేహమాధురి | 18 |
| 11) | శాంతిమంత్రం | 20 |
| 12) | సంతృప్తి | 22 |
| 13) | విమృశ్యకారిత్వం | 24 |
| 14) | అహింస | 26 |
| 15) | మట్టిలో మాణిక్యాలు | 29 |
| 16) | దాంపత్యం | 31 |
| 17) | ఆశ | 34 |
| 18) | సరిలేనివి | 38 |

| | | |
|---|---|---|
| 19) | గుణాతే ప్రధానం | 41 |
| 20) | పన్నుల వసూళ్ళు | 41 |
| 21) | పాత - క్రొత్త | 46 |
| 22) | పాత్ర విశేషం | 48 |
| 23) | పరోపకారం | 51 |
| 24) | క్షేత్రమహిమ | 54 |
| 25) | సహృదయత | 56 |
| 26) | కాలలీల | 58 |
| 27) | విధివిలాసం | 60 |
| 28) | క్షేమేంద్రుని రుచిరోక్తులు | 62 |
| 29) | మరికొన్ని మణులు | 72 |

# మణిమాల

## హితం

సులభాః పురుషా రాజన్! సతతం ప్రియవాదినః ।
అప్రియస్య తు పథ్యస్య వక్తా శ్రోతా చ దుర్లభః ॥

అది ఆదికవి వాల్మీకి పలికించిన హితవీణావాణి ...

హితం జీవనలతకు అమృతం, అనుభవాల కొమ్మ చివర విరిసిన పారిజాతం. అది వివేక నవనీతం అందుకే రామాయణంలో మారీచుడు హితాన్ని గురించి పలికిన మాటలు ఆణిముత్యాలు.

ముక్కుచెవులు తెగి, విరూపయైన శూర్పణఖ అవమాన భారంతో సోదరుడైన ఖరుని వద్దకు వెళ్ళి తనకు జరిగినదంతా చెప్పుకొంది. ఖరుడు పధ్నాలుగువేల అసురసేనతో కదనానికి కదిలాడు. అందరూ రాముని బాణాలచే హతులయ్యారు. అప్పుడు శూర్పణఖ ప్రతీకార వాంఛతో బుసలుకొడుతూ అమిత వేగంతో లంకకు వెళ్ళింది.

అన్నయైన రావణుని యెదుట సీతాసౌందర్యాన్ని వర్ణించింది. "అంతటి సౌందర్యరాశిని పొందావంటే మహేంద్రుడు కూడా నీముందు వెలవెలబోతాడు" అని ఊరించింది. అది విని వాని మనస్సు కామాతురమై కోడెనాగులా నాట్యమాడింది.

# 2

వెంటనే రావణుడు రథమెక్కి మాయావిద్యలందు చతురుడైన మారీచుని వద్దకు వెళ్ళి వాని సహాయం కోరాడు సీతను అపహరించే విషయంలో భృత్యునిగా తన ధర్మాన్ని నెరవేర్చుమన్నాడు కాని, అంతకుముందు రాముని చేతిలో చావుదెబ్బ తిని బ్రహ్మజిజ్ఞాసువై జటావల్కల ధారియై నియతాహారుడై ఆశ్రమంలో తపస్సు చేసుకుంటున్న మారీచుడు రావణునికి హితబోధ చెయ్యాలనుకుని ముందిలా నాంది పలికాడు -

“ఓరాజా ! ఎప్పుడూ ప్రియాల్ని పలికేవారు సులభంగా దొరుకుతారు కాని అప్రియమైన హితాన్ని చెప్పేవారు, వినేవారును యిద్దరూ దుర్లభమే”

హితం ప్రియంగా ఉండదు. అందుకే అది వినబుద్ధికాదు “చేదు నిజం”లా ! ఔషధం రుచిగా లేకపోయినా రోగనివారణ కోసం సేవించక తప్పదు కదా! అందువలన నచ్చకపోయినా హితాన్ని వినడం, మనస్సును నొప్పించినా హితాన్ని చెప్పడం ఉత్తముల లక్షణం.

ప్రతిపదార్థం :- రాజన్ = ఓరాజ ! సతతం = ఎల్లప్పుడు, ప్రియవాదినః = ప్రియముగా పలుకునట్టి, పురుషాః = పురుషులు, సులభాః = బాగుగా దొరుకువారు, అప్రియస్య = ప్రియము కాని అనగా ఇష్టముగా ఉండని, పథ్యస్య = హితము యొక్క (హితమును), వక్తా = పలుకువాడు, చ = మరియు, శ్రోతా = వినువాడు, దుర్లభః = లభించరు అనగా అరుదుగా ఉందురని భావము.

# ఏది మార్గం?

తర్కో౽ప్రతిష్ఠః శ్రుతయో విభిన్నాః
నైకో ఋషిర్యస్య మతం ప్రమాణమ్ ।
ధర్మస్య తత్త్వం నిహితం గుహాయాం
మహాజనో యేన గతస్స పంథాః ॥

మహాభారతంలో యక్షుని చిక్కుప్రశ్నకు ధర్మరాజిచ్చిన సమాధానం అది.

యక్షుడు పుంఖానుపుంఖంగా ప్రశ్నల వర్షం కురిపిస్తున్నాడు. ధర్మరాజు తడుముకోకుండా సమాధానాలు చెబుతున్నాడు. అందుకే అతను "యుధిష్ఠిరుడు". యుద్ధంలో, జీవన యుద్ధంలోను స్థిరత్వం కలవాడు చివరగా యక్షుడు నాలుగు ప్రశ్నలడిగాడు - "ఎవడు ఆనందించగలుగుతాడు? లోకంలో అద్భుతమేమిటి? ఏది సరైన మార్గం? ఏది వార్త? వాటిలో మూడవ ప్రశ్నకు సమాధానం యిది -

సూక్ష్మమైన ధర్మ స్వరూపం గుహలోపల దాగి ఉన్నది. అనగా నిగూఢమైనది. అయితే ఆ ధర్మ స్వరూపాన్ని తెలుసుకొనేదెలా? ఊహించుదామా? ఊహ స్థిరమైనది కాదు. శ్రుతుల్ని ఆశ్రయించుదామా? శ్రుతులు అనగా వేదాలు విభిన్నమర్గాలను బోధిస్తున్నాయి. పోనీ ఋషి అభిప్రాయాన్ని అనుసరించుదామా అంటే వివిధ ఋషులూ... విభిన్న మతాలూ .. మరి ధర్మసౌధాన్ని చేరే మార్గమేది? ఆ సమస్యకు ధర్మరాజు చెప్పిన

పరిష్కారం రమ్యమైనది. "ఎక్కువ మంది న...
మార్గం''.

శ్రుతి-స్మృతిపురాణాది వాఙ్మయాన్ని ...
బోధల్ని భావించి జీవనధోరణులను అనుసం...
స్వరూపాన్ని దర్శించిన మహాపురుషులు సాగిన ...
మందికీ అనుసరణీయమౌతుంది. ''ఏటు పోవాలి ?...
రించాలి" అనే సందేహం కలిగినప్పుడు పదిమం...
నువ్వు నడు, అధిక జనులు ఆచరించేదాన్ని న...
అదే ధర్మం.

ప్రతి పదార్థం :- తర్కః = ఊహ, అప్రతిష్ఠః = ...
శ్రుతయః = వేదవాక్యములు, విభిన్నాః = విభేద...
యస్య = ఎవని యొక్క, మతం = అభిప్రాయము, ...
ప్రామాణికమో, ఋషిః = అటువంటి ఋషి, నైకః = ...
కాదు, అనగా చాలమంది ఋషులున్నారు. (అం...
ధర్మస్య = ధర్మము యొక్క, తత్త్వం = స్వరూప...
యాం = గుహలో, నిహితం = ఉంచబడినది అన...
మైనది, యేన = దేనిద్వారా, మహాజనః = అధికజను...
వెళుతారో, సః = అది, పంథాః = మార్గము.

## 5

# పండితుడు

అశోచ్యానన్వశోచ స్త్వమ్
ప్రజ్ఞావాదాంశ్చ భాషసే ।
గతాసూనగతాసూంశ్చ
నానుశోచన్తి పండితాః ॥

అది శ్రీకృష్ణుడు ఊదిన ఉపదేశమురళి ...

కురుక్షేత్ర రణరంగసీమలో అటు కౌరవసేన.... ఇటు పాండవసేన రెండు సేనల నడుమ అర్జునుడు విలపిస్తున్నాడు- "గురువులు, బంధువులు, ఆప్తులు, మిత్రులైన వీరినందరిని చంపి ఆ నెత్తుటికూటితో యెలా భోగాల్ని అనుభవింపగలను ? ఓ కృష్ణా ! నీకు శిష్యుణ్ణి. నిన్ను శరణు వేడుతున్నాను. నాకు శ్రేయోమార్గాన్నుపదేశించు.

అది విని కృష్ణభగవానుడు చిరునవ్వులు చిందిస్తూ యిలా పలికాడు -

"ఓ అర్జునా ! నువ్వు దుఃఖింపదగని వారిని గురించి దుఃఖించావు, పైగా ఎంతో తెలివిగా మాట్లాడుతున్నావు మరణించిన వారిని గురించి కాని, జీవించియున్న వారిని గురించి కాని దుఃఖింపని వారే పండితులు".

సామాన్యంగా పండితులంటే శాస్త్రవైదుష్యం కలవారని లోకంలో వాడుక. కాని ఎవరికొరకును, దేని కొరకును సుఖాన్ని,

దుఃఖాన్ని పొందక, పొందినను వ్యక్తం చేయక నిగ్రహించు కొనగలవాడే పండితుడు. మనఃస్థైర్యాన్ని పొందాలి। అటుపైన ఆత్మజ్ఞానానికి వెలుగుబాటలు చేసుకొని సాగిపోవాలి। అప్పుడే "పండితుడ"నే పదం సార్థకమౌతుంది.

ఈ శ్లోకం గీతాశాస్త్రమహామంత్రానికి బీజం వంటిదంటారు. గీతాసారమంతా యిందులోనే యిమిడి ఉంది.

ప్రతిపదార్థం :- త్వం = నీవు, అశోచ్యాన్ = శోకింపదగని వారిని గూర్చి, అన్వశోచః = శోకించితివి, చ = మరియు, ప్రజ్ఞా వాదాన్ = బుద్ధివాదముతో కూడిన మాటలను, భాషసే = మాట్లాడు చున్నావు, పండితాః = పండితులు, గత + అసూన్ = ప్రాణము లను కోల్పోయిన వారిని గూర్చి, చ = మరియు, అగతాసూన్ = మరణించని వారిని గూర్చి అనగా జీవించియున్న వారిని గూర్చి, న అనుశోచన్తి = దుఃఖింపరు.

## జీవనరాగం

సుఖం హి దుఃఖాన్యనుభూయ శోభతే
ఘనాంధకారాదివ దీపదర్శనమ్ ।
సుఖాత్తు యో యాతి దశాం దరిద్రతామ్
స్థితః శరీరేణ మృతః స జీవతి ॥

అది భాసుని "చారుదత్త" నాటకంలో మెరిసిన ఒక అనర్ఘ రత్నం....

## 7

చారుదత్తుడు గొప్ప వాణిజ్యవేత్త. అతను తన అనంతమైన సంపదను అడిగిన వానికి లేదనకుండా దానంచేశాడు. చివరకు దరిద్రుడయ్యాడు. మనస్వి కాబట్టి దారిద్ర్యంలోని అనుభవాల్ని ఆర్ద్రహృదయంతో మనకు అందించాడు.

ఒకనాడు చారుదత్తుడు తన మిత్రుడైన ఆత్రేయునితో మనసు విప్పి మాట్లాడుతూ తన జీవన చక్రం వేసిన సుఖదుఃఖాల ముద్రల రహస్యాన్ని వివరించాడు.

"దుఃఖాల తరువాత వచ్చే సుఖం చీకటి నుండి దివ్వెల వెలుగులోనికి అడుగుపెట్టటం వంటిది. ఇది మధురానుభూతి. సుఖం నుండి దారిద్ర్యంలోనికి దిగజారిన వాడు జీవన్మృతుడు.

కష్టాల సముద్రాన్ని ఈది ఈది అలసిపోయి హఠాత్తుగా కళ్ళముందు కనిపించిన సుఖతీరం చేరటం చెదరిపోని ఒక తీయని అనుభూతి. సుఖాలలో ఓలలాడి మైమరచిన వేళ ఒక్కసారి కష్టాల లోయల్లో పడిపోవటం ఆః! అది ఊహకే భయంకరమైనది ...

అందువలన నరుడా : సుఖం వచ్చినా, దుఃఖం వచ్చినా చలించకు ! సమస్థితిలో జీవనరాగం ఆలపించు !

ప్రతిపదార్థం :- దుఃఖాని = దుఃఖములను, అనుభూయ = అనుభవించి, సుఖం = సుఖము, ఘన + అంధకారాత్ = దట్టమైన చీకటి నుండి, దీపదర్శనమ్ + ఇవ = దీపపు వెలుగును చూచినట్లు, శోభతే = ప్రకాశించును (ఒప్పును), తు = కాని, యః =

ఎవడు, సుఖాత్ = సుఖమునుండి, దరిద్రతాం దశాం = దారిద్ర్య దశను, ఉపైతి = పొందునో, సః = అతడు, శరీరేణ = దేహముతో స్థితః = ఉన్నప్పటికి, మృతః = మృతుడై, జీవతి = బ్రతుకును అనగా మరణించిన వానివలె విలువను కోల్పోయి బ్రతుకు చుండును.

## అరుదైన గుణాలు

జ్ఞానే మౌనం క్షమా శక్తౌ త్యాగే శ్లాఘావిపర్యయః ।
గుణాః గుణానుబంధిత్వాత్ తస్య సప్రసవాః ఇవ ॥

అది కాళిదాసమహాకవి మంజుల వాగ్విలాసం....

"రఘువంశ" మహాకావ్యం రఘువంశరాజుల జీవన చరిత్రలకు మణిదర్పణం. రఘువంశం ఉదాత్తగుణరత్నకోశం. ఆ మహనీయుల్లో దిలీపుడు సుప్రసిద్ధుడు. ఆయన పరిపూర్ణ వ్యక్తిత్వం కలిగిన రాజసింహం. వాని వ్యక్తిత్వంలోని కొన్ని విశేషాల్ని భావితరాలకు విలువైన కానుకలుగా కవి అక్షరకోశంలో పొందుపరిచాడు.

"తన జ్ఞానాన్ని ప్రకటించటంలో మౌనం, శక్తిని ప్రదర్శించటంలో సహనం, త్యాగవిషయంలో ఆత్మస్తుతి లేక పోవటం - ఈ గుణాలన్నీ దిలీపునియందు తోబుట్టువుల లాగా పరస్పరం అనుబంధాన్ని కలిగివున్నై".

అవసరమైన వేళల్లో మన పరిజ్ఞానాన్ని ప్రకటించాలే తప్ప దానికోసం ఆరాటపడరాదు. దానివల్ల మరికొన్ని ఆపదల్ని కొని తెచ్చుకుంటాం. వసంతం వచ్చేదాక కోకిల గొంతుముడి విప్పుతుందా ?

అలాగే తన సామర్థ్యాన్ని ప్రకటించుటలో సహనం కావాలి. అవసు దొరికినప్పుడు మన సామర్థ్యాన్ని ఆవిష్కరించటం వివేక మౌతుంది. త్యాగాలు చేసి ఊహూరా చాటుకోరాదు. "న దత్త్వా బ్రూయాత్" అని మనువు మాట దానం చేసి చెప్పుకోరాదని అభిప్రాయం.

ముచ్చటైన ఈ మూడు గుణాల్లో (మౌనం, క్షమ, శ్లాఘా విపర్యయం) అంతర్వాహినిగా "వినయ'' మూంది. అహంకారం శిథిలమైన హృదయసీమలో "వినయం" చిగురిస్తుంది. అప్పుడు మనిషి ఋషిగా ఎదుగుతాడు, బ్రతుకుతాడు

ప్రతిపదార్థం :- జ్ఞానే = జ్ఞానము నందు, మౌనం = మౌనము, శక్తౌ = శక్తి విషయమున అనగా సామర్థ్యమును ప్రదర్శించుట యందు, క్షమా = సహనము, త్యాగే = త్యాగ గుణమున, శ్లాఘావిపర్యయః = ఆత్మస్తుతి లేకపోవుట, తస్య = ఆ దిలీపుని యొక్క గుణాః = జ్ఞానం, శక్తి, త్యాగం అను గుణములు, గుణ + అనుబంధిత్వాత్ = మౌనం మొదలైన గుణము లతో కలసి ఉండుట వలన, సప్రసవాః ఇవ = తోబుట్టువుల వలె (ఒప్పినవి).

# మాట విలువ

లౌకికానాం హి సాధూనామర్థం వాగనువర్తతే ।
ఋషీణాం పునరాద్యానాం వాచమర్థోఽనుధావతి ॥

అది భవభూతి పలుకు బంగారం ...

"ఉత్తరరామచరితం" అనే నాటకంలో వెలసిన దృశ్యమిది -

శ్రీరాముని పట్టాభిషేకమైంది. చూడటానికి వచ్చిన హితులు బంధుమిత్రులు, మహర్షులు అందరూ తమతమ ప్రదేశాలకు వెళ్ళిపోయారు. కులగురువైన వసిష్ఠుడు, కౌసల్య మున్నగు రాజమాతలు ఋశ్యశృంగుని యాగాన్ని చూడటానికి వెళ్ళారు. ఇక అయోధ్యానగరంలో అంతఃపురంలో శ్రీరాముడు, నిండుచూలాలైన సీత ఉన్నారు.

అప్పుడు ఋశ్యశృంగుని ఆశ్రమం నుండి వచ్చిన అష్టావక్రుడను ముని రాముణ్ణి సమీపించి వసిష్ఠుని ఆశీస్సును "సీత వీరప్రసవ అగుగాక!" అని వినిపించాడు. ఆ ఆశీస్సుమ మాలా పరిమళం చేత పులకితగాత్రుడైన రాముని మదిలో మెదిలిన భావతరంగమిది -

"సామాన్యులైన సాధువుల వాక్కు అర్థాన్ని అనుసరించి ప్రసరిస్తుంది. కాని మహనీయులైన మహర్షుల వాక్కును అర్థమే అనుసరిస్తుంది."

## 11

సత్యసంధులైన సాధువులు అర్థవంతంగా పలుకుతారు. అది సహజం. కాని వశ్యవాక్కులు, మహిమాన్వితులునైన మహర్షులు పలికింది సార్థకమౌతుంది. వారి వాక్కు యేనాడూ వ్యర్థం కాదు వాగ్గతమైన శక్తి అటువంటిది. ఆ శక్తిని సాధించటానికి తొలిమెట్టు "మితభాషణం"

మితంగా మాట్లాడు !

అప్పుడు నీ మాట వెలుగుబాట అవుతుంది.

ప్రతి పదార్థం !- లౌకికానాం = లోకవ్యవహారమునకు అనుగుణముగా ప్రవర్తించునట్టి, సాధూనాం = సాధువుల యొక్క, వాక్ = వాక్కు, అర్థం = అర్థమును, అనువర్తతే = అనుసరించును, పునః = మరల (ఇక్కడ "కాని" అను అర్థము చెప్పుకొనవలెను) ఆద్యానాం = అగ్రగణ్యులైన, ఋషీణాం = ఋషుల యొక్క, వాచం = వాక్కును, అర్థః = అర్థము, అనుధావతి = అనుసరించును.

# కార్యశూరులు

ప్రారభ్యతే న ఖలు విఘ్నభయేన నీచైః
ప్రారభ్య విఘ్నవిహతా విరమన్తి మధ్యాః ।
విఘ్నైః ముహుర్ముహురపి ప్రతిహన్యమానాః
ప్రారబ్ధముత్తమజనాః న పరిత్యజన్తి ॥

అది భర్తృహరి సుభాషిత రత్నదీపిక ..

జీవన మొక ప్రయాణం. లక్ష్యం లేని జీవితం గమ్యం లేని ప్రయాణం. ఉదాత్తమైన లక్ష్యం కోసం పయనించే మానవుని జీవనమార్గంలో ఎన్నెన్ని డొంకలు ! ముళ్ళపొదలు ! వాగులు ! రాళ్ళగుట్టలు ! అదంతా విఘ్నాల వైచిత్రి. అవన్నీ దాటుకుంటూ ముందుకు సాగితే, ఫలించిన కలల బంగరు వెలుగులో విహరించవచ్చు, ఈ భావమే పై శ్లోకం పలికిన కవిహృదయంలో యిలా పరిమళించింది –

"అధములు ముందే విఘ్నాలు కలుగుతాయేమో అని భయపడి పనుల్ని ప్రారంభించరు. ఇక కొందరు పనుల్ని ప్రారంభించి విఘ్నాలు కలుగగానే విరమించుకుంటారు. వారు మధ్యములు, ఉత్తములు అలా కాదు. ఎన్ని విఘ్నాలు కలిగినా ప్రారంభించిన పనుల్ని విడచిపెట్టక పూర్తి చేస్తారు".

ఆర్భాటంతో ప్రారంభించి విఘ్నాలతో పోరాడ లేక మధ్యలోనే పనుల్ని విడచిపెట్టే మధ్యముల్ని ఆరంభశూరులంటారు. వారి జీవితం ఊగిసలాటల ఊయ్యాల. సమాజ-అభ్యున్నతికీ, దేశప్రగతికీ కార్యశూరులు కావాలి. కార్యశూరులుగా వెలుగొందటానికి దృఢసంకల్పం కావాలి. దృఢ సంకల్పానికి ఊపిరి మనఃస్థైర్యం. కాబట్టి ముందు దాన్ని సాధించు, తర్వాత ముందుకు అడుగు వెయ్యి.

ప్రతిపదార్థం :- నీచైః = నీచుల చేత, విఘ్నభయేన = విఘ్నముల వలన భయము చేత, న ప్రారభ్యతే ఖలు = (కార్యము) ప్రారంభింపబడుట లేదు కదా !, మధ్యాః = మధ్యములు. ప్రారభ్య = ప్రారంభించి, విఘ్నవిహతాః = విఘ్నములచే బాధింపబడినవారై, విరమన్తి = విరమించుచున్నారు, ముహుః + ముహుః = మాటిమాటికిని, విఘ్నైః = విఘ్నములచే, ప్రతిహన్యమానాః అపి = బాధింపబడుచున్నప్పటికీ, ఉత్తమ జనాః = ఉత్తములు, ప్రారబ్ధం = ప్రారంభించినదాన్ని, న పరిత్యజన్తి = విడచి పెట్టరు.

# జాగరూకత

ఉపాయమాస్థితస్యాపి నశ్యన్త్యర్థాః ప్రమాద్యతః ।
హన్తి నోపశయస్థోఽపి శయాలుః మృగయుః మృగాన్ ॥

అది "మాఘ" మహాకవి కట్టిన అక్షరమణితోరణం....

"శిశుపాలవధ" కావ్యప్రాంగణంలోని దృశ్యమిది —

అది ద్వారక. శ్రీకృష్ణలీలలకు మనోహరవేదిక. అప్పుడే నారదుడు వచ్చి వెళ్ళాడు. "దుష్టుడైన శిశుపాలుణ్ణి త్వరగా తుదముట్టించాలి" అని మహేంద్రుని సందేశాన్ని కృష్ణునిచెవిలో ఊది వెళ్ళాడు. ఇంతలో ఇంద్రప్రస్థపురం నుండి ధర్మజుని ఆహ్వానం అందింది— "రాజసూయయాగానికి రమ్మ"ని. కృష్ణుడు సందిగ్ధావస్థలో పడ్డాడు— "శిశుపాలుణ్ణి వధించటానికి చేదిదేశం వెళ్ళాలా? లేక ఆప్తులు జరుపుకునే రాజసూయానికి వెళ్ళాలా?" వెంటనే కృష్ణుడు అన్నయైన బలరామునితో, పినతండ్రి మరియు ప్రధాన సచివుడైన ఉద్ధవునితోను రహస్య సమావేశం జరిపాడు. అప్పుడు ఉద్ధవుడు చేసిన ఉపదేశమాలిక లోని ఒక పువ్విది.... ఆ పువ్వులో పరిమళించిన ధర్మహృదయమిది ...

"ఎంత ఉపాయం కలవానికైనా అజాగ్రత్త వలన ప్రయోజనాలు నశించిపోతాయి. అది ఎంతటి వివేకవంతునికైనా

తప్పదు. అంటే ఏకాగ్రత ముఖ్యమన్నమాట ! నిద్రాళువైన వేటగాడు చాటుగా మాటు వేసి వున్నా జంతువుల్ని చంపలేడు, నిద్ర వాని దిట్టతనాన్ని నిష్ఫలం చేస్తుంది. అలాగే నైపుణ్యం గలవాడైనా జాగ్రత్త లేకపోతే లక్ష్యసాధకుడు కాలేడు."

ప్రతిపదార్థం'- ఉపాయం=ఉపాయమును, ఆస్థితస్య + అపి = పొందిన వాడైనను (ఉపాయముతో కార్యములను సాధించు వాడైనను), ప్రమాద్యతః = జాగ్రత్త లేని వాని యొక్క, అర్థాః = ప్రయోజనములు. నశ్యన్తి=నశించుచున్నవి; శయాలుః = నిద్రాళువు, మృగయుః=వేటగాడు, ఉపశయస్థః + అపి = మాటువేసి ఉన్నవాడైనప్పటికి (ఉపశయమనగా మృగములు పోవు మార్గమున వేటగాడు పొంచి దాగుకొని యుండు గుంట), మృగాన్ = మృగములను, న హన్తి = చంపలేడు.

# సారగ్రహణం

అనన్తశాస్త్రం బహు వేదితవ్యమ్
అల్పశ్చ కాలో బహవశ్చ విఘ్నాః।
యత్సారభూతం తదుపాసితవ్యమ్
హంసో యథా క్షీరమిహాంబుమిశ్రమ్

ఇది "విష్ణుశర్మ" మూటగట్టిన వరహాల మాట.

అనగనగా దక్షిణాదిన ఒక జనపదం ఉండేది. దానిపేరు మహిళారోప్యం. దాన్ని "అమరశక్తి" అనే రాజు పాలిస్తూండేవాడు. ఆయనకు ముగ్గురు కొడుకులు వారు ముగ్గురూ వెంపలి చెట్టుకు నిచ్చెన వేసేటంతటి పరమమూర్ఖులు చదువు అబ్బలేదు. రాజకుమారులు కాబట్టి భోగలాలసులయ్యారు. కాలం ఆగదు కదా! రాజు ముదుసలి అయ్యాడు. కుమారులు యుక్తవయస్కులయ్యారు.

"విద్యాగంధం లేని తన కుమారులు తన తర్వాత రాజ్య పాలన చేయగలరా?" అని రాజు చింతించసాగాడు. వివేక హీనులైన తన పుత్రుల్ని తల్చుకొని తల్చుకొని వ్యథాభరిత హృదయంతో అమరశక్తి తనకు ఆప్తుడైన మంత్రి "సుమతి"ని ఒక ఉపాయం చెప్పమని అడిగాడు. అప్పుడు సుమతి సకల శాస్త్ర పారంగతుడైన విష్ణుశర్మ ఒక్కడే రాజకుమారుల్ని వివేక

వంతులుగా తీర్చిదిద్దగలడని తెలిపాడు వారి విద్యాభ్యాసానికి సులువైన మార్గాన్ని కూడ యిలా సూచించాడు-

"ఏ శాస్త్రమైనా అనంతమైనది. అందు తెలుసుకొన వలసింది చాలా ఉంటుంది. కాని మనకున్న కాలం అంటే వయస్సు చాల తక్కువ. అందునా అనేక విఘ్నాలు ఎదురౌతాయి. కాబట్టి నీటితో కలసిన పాలనుండి పాలను మాత్రమే గ్రహించు హంస లాగ శాస్త్రాల నుండి సారభూతమైన విషయాన్ని మాత్రం గ్రహించాలి. వివేకవంతుడు కావాలి''.

ఈ మార్గంలోనే విష్ణుశర్మ సకలశాస్త్రాల సారాన్ని కథల రూపంలో రాజకుమారులకు అందించాడు. ఆ కదలే "పంచతంత్ర" కథలు

ఆ పంచతంత్ర కదలే ప్రపంచ సారస్వతాకాశంలో విమల తారకలై వెలుగుల్ని వెలారుస్తున్నాయి.

ప్రతిపదార్థం :- అనంతశాస్త్రం = అంతులేని విషయాలతో కూడిన శాస్త్రము (ఏ శాస్త్రమైనా అనంతమే). వేదితవ్యం = తెలుసుకొనవలసినది, బహు = చాల(ఉన్నది), కాలః = కాలము, అల్పః = అల్పమైనది, చ = మరియు, విఘ్నాః = విఘ్నములు బహవః = చాల (కలవు), యత్ = ఏద్దైతే, సారభూతం = సారమైనదో, తత్ - అది, ఉపాసితవ్యం = పొంద దగినది, యథా= ఎట్లనగా, అంబుమిశ్రం = నీటితో కూడిన, క్షీరమ్ = పాలను, హంసః = హంస (గ్రహించునట్లు).

# స్నేహమాధురి

ఆరంభగుర్వీ క్షయిణీ క్రమేణ
లఘ్వీ పురా వృద్ధిముపైతి పశ్చాత్ ।
దినస్య పూర్వార్ధ పరార్ధ భిన్నా
ఛాయేవ మైత్రీ ఖలసజ్జనానామ్ ॥

"సృష్టిలో తీయనైది స్నేహమేనోయ్" ! నిజం ! తోటి వారి మనసునెరిగి మసలుకోవడాన్ని నేర్పే విద్య స్నేహకళ. అంతరాలు లేని ఆనందరసధుని స్నేహమయ జీవనం. అట్టి స్నేహాన్ని చిరకాలం రక్షించుకోవటం సంస్కారవంతుల లక్షణం. ఆ భావాన్ని భర్తృహరి యిలా వివరించాడు —

"దుష్టుల స్నేహం పగటి పూర్వార్ధంలో ప్రసరించే నీడ వంటిది. అంటే - ఉదయాన పెద్దదిగా ప్రారంభమైన నీడ మధ్యాహ్న వేళకు క్రమక్రమంగా క్షీణించి పోతుంది. అలాగే దుష్టుల స్నేహం కూడ మొదట ఘనంగా ఉంటుంది. రోజులు గడుస్తున్న కొద్దీ విభేదాలతో, ఈర్ష్యా ద్వేషాలతో వారి స్నేహ సౌధం బీటలు వారి పోతుంది.

కాని సత్పురుషుల మైత్రి అలా కాదు. అది పగటిపూట ఉత్తరార్ధంలో ప్రసరించే నీడవంటిది. అంటే - మధ్యాహ్నం

నుండి సాయంత్రం వరకు గల సమయంలో నీడ క్రమంగా వృద్ధి చెందుతుంది. అలాగే మంచివారి స్నేహం కూడ మొదట అల్పంగా, ఆర్భాటరహితంగా ఉన్నా, తర్వాత దినదినాభి వృద్ధి చెందుతూ పవిత్ర భావనలతో, శుభకామనలతో సుదృఢమై సుందరమై అలరారుతుంది, ఆదర్శప్రాయమౌతుంది.

నీటి బుడగ వంటి స్నేహం వద్దు. వాడిపోని, వసి వాడని వెన్నలాంటి మధురమైన మైత్రి కావాలి. ప్రతి హృదయం స్నేహమయమైనప్పుడే విశ్వశాంతి శతపత్రపద్మమై పరిమళిస్తుంది.

ప్రతిపదార్థం :— ఖల సజ్జనానాం = దుష్టుల యొక్క, సత్పురుషుల యొక్కయు, మైత్రీ = స్నేహము, దినస్య = పగటి యొక్క, పూర్వ + అర్ద= మొదటి సగభాగమందు (మధ్యాహ్నము వరకు), పర + అర్ధ = రెండవ సగభాగమందు (మధ్యాహ్నము నుండి సాయంత్రము వరకు),భిన్నా = బేదము కలిగిన, ఛాయా + ఇవ = నీడవలె, ఆరంభగుర్వీ = మొదట పెద్దది, క్రమేణ = క్రమముగా, క్షయిణీ = క్షీణించునది, పురా = మొదట లఘ్వీ = చిన్నది, పశ్చాత్ = పిమ్మట, వృద్ధిం = అభివృద్ధిని, ఉపైతి = పొందును.

# క్షాన్తిమంత్రం

దుర్జన వదన వినిర్గత వచన భుజంగేన సజ్జనో దష్టః ।
తౌషధశతైః అసాధ్యః చికిత్స్యతే శాంతి మంత్రేణ ।।

అది రాజకవియైన సుందరపాండ్యుని రమ్యోక్తి

క్రీ శ. 6వ శతాబ్దికి పూర్వుడైన సుందరపాండ్యుడు మధురానగరాధీశుడు, వివిధశాస్త్ర నిష్ణాతుడు. బహుగ్రంథ నిర్మాత. ఆయన గ్రంథాలలో ప్రసిద్ధమైన "నీతిద్విషష్టికా" జీవితపు విలువల్ని వివరించే మధుర వాక్యాల మంజూషిక. అందులోని ఒక మణి యిది.

దుష్టుని నోటినుండి వెలువడే దుర్వచనాల విషసర్పాలకు సజ్జనుడు బలి ఔతున్నాడు. ఆ పాముకాటుకు మందులేవీ లేవు దానికి సహనమే సరియైన మంత్రం. అదే తిరుగులేని చికిత్స,

నిజమే "లోకమా! భుజంగానీక వల్మీకమా!" అని ఒక కవి అన్నట్లు దుష్టులెప్పుడూ విషసర్పాల వలె బుసకొడుతూ సజ్జనుల మానససరోవరాలలో విషం క్రక్కి కలుషితం చెయ్యాలని ప్రయత్నిస్తూనే ఉంటారు. కాని సజ్జనుని సహనం దివ్యౌషధం లాగ పనిచేస్తుంది. ప్రభావశాలి యైన శ్రీకృష్ణుడు కూడ శిశు

పాలుని ఆగడాల్ని సహించి సహించి చివరకు వానిని తుద ముట్టించాడు.

"ఓర్పు సాత్త్వికతకు సంకేతం. అది సామర్థ్యానికి నెచ్చెలి ఓర్పు నేర్పుకు నెయ్యం".

ప్రతిపదార్థం:- దుర్జన = దుష్టుని యొక్క, వదన = ముఖము నుండి, వినిర్గత = వెలువడిన, వచన = మాట అనెడు, భుజంగేన = సర్పము చేత, దష్టః = కరవబడిన, సజ్జనః = సత్పురుషుడు, ఔషధశతైః = వందల కొలది మందుల చేతనైనను, అసాధ్యః = చికిత్సచేయుటకు సాధ్యుడు కానివాడై, క్షాంతిమంత్రేణ = సహనమనే మంత్రము చేత, చికిత్స్యతే = చికిత్స చేయబడుచున్నాడు.

# సంతృప్తి

మూఢ! జహీహి ధనాగమతృష్ణామ్
కురు తనుబుద్ధే! మనసి వితృష్ణామ్ ।
యల్లభసే నిజకర్మోపాత్తమ్
విత్తం తేన వినోదయ చిత్తమ్ ॥

జగద్గురువులైన శ్రీ ఆదిశంకరుల లలితాదేశ కశాఘాతం అది

ధన + ఆగమతృష్ణాం అంటే ధనమింకా రావాలనే తృష్ణను, జహీహి అంటే విడచిపెట్టు అని భగవత్పాదుల బోధ. "డబ్బింకా రావాలి, డబ్బింకా రావాలి" అనే అనంతమైన తృష్ణ అంటే దాహం మానవుణ్ణి ఏ అకృత్యానికైనా ప్రేరేపిస్తుంది.

సాధారణంగా కోరికలు రెండు విధాలుగా ఉంటాయి అవి సహజమైనవి, కృత్రిమమైనవీ.

సహజములైన కోరికలు అవసరాలను దాటిపోవు. ఆకలి సహజమైన కోరిక, దాహం సహజమైన కోరిక. తగినంత అన్నం తింటే ఆకలి తీరుతుంది. నీరు త్రాగితే దాహం పోతుంది. కాని కృత్రిమములైన కోరికలు అలాకాదు. పదవీవ్యామోహం, స్త్రీ వాంఛ మొదలైన భోగకాంక్షలు మనస్సులో అనంతంగా ఉద్భవిస్తూనే ఉంటాయి. అగ్నిలో ఆజ్యం పోస్తే అదింకా ప్రజ్వరిల్లు

తుంది. అలాగే కృత్రిమ వాంఛలుకూడ తీర్చుకున్న కొద్దీ, అవి ఉపశమించపోగా యింకా యింకా వృద్ధిచెందుతూనే ఉంటాయి. అర్థకామాలు శ్రుతిమించితే అనర్థహేతువులు. అందుకే ఆదిశంకరు లిలా హెచ్చరించారు—

"ఓ అల్పబుద్ధీ! మనస్సులో తృష్ణకు తావివ్వకు. నీ శ్రమకు లభించిన ధనంతో హాయిగా జీవించు మనస్సులో సంతృప్తిని నిలుపు!

అదే సుఖజీవన మార్గం ..!
అప్పుడే ఇలపై స్వర్గం .!

ప్రతిపదార్థము :— తనుబుద్ధే! = అల్పమైన బుద్ధిగల, మూఢ = మూర్ఖుడా!, ధన + ఆగమతృష్ణాం = ధనము రావలెననెడి కోరికను, జహీహి = విడువుము, మనసి = మనస్సునందు, వితృష్ణాం కురు = సంతృప్తిని పొందుము, నిజకర్మ + ఉపాత్తం = తనకర్మలచే సంపాదింపబడిన, యత్విత్తం = ఏ ధనమును, లభసే = పొందెదవో, తేన = దానిచే, చిత్తం = మనస్సును, వినోదయ = అలరింపజేసు కొనుము.

# విమృశ్యకారిత్వం

సహసా విదధీత న క్రియామ్
అవివేకః పరమాపదాం పదమ్ ।
వృణతే హి విమృశ్యకారిణమ్
గుణలుబ్ధాః స్వయమేవ సంపదః ॥

భవ్యకవితాభాస్కరుడైన "భారవి" మహాకవి వెలయించిన పదమాలిక యిది.

"కిరాతార్జునీయమ్" అనే మహాకావ్యంలోని సన్నివేశం యిది.

జూదంలో ఓడిన పాండవులు కానల్లో కోనల్లో కటిక చీకట్లలో బాధలు పడుతూ బరువుగా కాలాన్ని గడుపుతున్నారు. రాజనీతి ప్రకారం ధర్మరాజు ఒక వనేచరుణ్ణి హస్తినాపురం పంపాడు. శత్రువుల పరిపాలనా విశేషాల్ని రహస్యంగా తెలుసుకొని రమ్మన్నాడు. కొంతకాలం తర్వాత వనేచరుడు ద్వైతవనంలో వున్న ధర్మరాజును కలుసుకున్నాడు. సుయోధనుడు రాజ్యాన్ని చాల సమర్థవంతంగా పరిపాలిస్తున్నాడని చెప్పి విశేషాల్ని వివరించి వెళ్ళిపోయాడు. అదంతా విన్న ద్రౌపది ధర్మరాజును ఎత్తిపొడుపు మాటల్తో ఉద్రేకింపజేయాలని ప్రయత్నించింది. "నువ్వు వేసిన తప్పటడుగు వల్లనే మేమింత దుర్దశను అనుభవిస్తున్నాం" అన్నది.

వెంటనే భీమసేనుడందుకొని "ప్రతీకారం తీర్చటమే పురుష లక్షణం" అంటూ కన్నెఱ్ఱజేశాడు. యుద్ధానికి సన్నద్ధులు కావడమే కర్తవ్యమని గర్జించాడు ఆ మాటలన్నీ ప్రశాంతంగా విని ధర్మరాజు ప్రసన్నదృక్కులతో పాంచాలివైపు తిరిగి యిలా అన్నాడు —

"ఏ కార్యాన్నైనా అనుకున్న వెంటనే చేయరాదు. ఆలోచన ఆచరణలోనికి రావటానికి ముందు మంచి చెడుల వివేచన అవసరం. అట్టి వివేచన లేకపోతే ఎన్నో అనర్థాలు కలుగుతాయి. గుణాలను ప్రేమించే సంపదలు వివేకశీలుణ్ణి స్వయంగా వచ్చి వరిస్తాయి''.

"విమృశ్య" అనగా బాగుగా విచారించి, ''కరోతి" అనగా చేయువాడు - "విమృశ్యకారి". ఆలోచించి అడుగువేసే వాడన్న మాట!

విమృశ్యకారిత్వం విజయానికి ఉత్తమమార్గం.

ప్రతి పదార్థం :- సహసా = వెంటనే, క్రియాం = పనిని, న విదధీత = చేయరాదు, అవివేకః = మంచి - చెడులను గూర్చి ఆలోచించక పోవుట, ఆపదాం = ఆపదలకు, పరం పదం = ప్రముఖస్థానము (అనగా కారణము), గుణలుబ్ధాః = గుణములందు ప్రీతిగల, సంపదః = సంపదలు, విమృశ్యకారిణం = ఆలోచించి పనులు చేయువానిని, స్వయం ఏవ = స్వయముగానే, వృణతే = వరించును.

# అహింస

ప్రాణహాని వచ్చుపట్టున, సర్వధ
నాపహార వేళయందు నడపు
సత్యమనృత మంద్ర సత్యంబు సూనృత
మని పరిగ్రహింతురార్యజనులు.

అది తీయందనాల తిక్కన భారతి

కురుక్షేత్ర మహాసంగ్రామంలో ఒకరోజు ధర్మరాజు కర్ణుని చేతిలో పరాభూతుడయ్యాడు. అవమానభారంతో కుమిలిపోతు న్నాడు. ఆరోజు కర్ణుని విజృంభణాన్ని చూసి జంకిన అర్జునుడు కూడ శిబిరాన్ని చేరుకున్నాడు. అది తెలిసి ధర్మరాజు మరింత వ్యధతో ముందువెనకలాలోచించక "తమ్ముడా! భయపడి పారి వచ్చావా? నీ గాండీవాన్ని కృష్ణునికి ఎరవుగా యిచ్చినా బాగుండేది. అతనే శత్రువుల్ని తుదముట్టించేవాడు'' అని పరుషంగా పలికాడు.

అది విని పార్థుడు తోకపై లేచిన త్రాచులా ఉగ్రుడై అన్నపైకి కత్తి దూయబోతుండగా కృష్ణుడతన్ని నివారించాడు. కొంత శాంతించిన అర్జునుడు కృష్ణునితో అన్నాడు - "కృష్ణా

నా ధనుస్సును వరులకిమ్మనే వాని శిరస్సును ఖండిస్తానని మునుపెన్నడో ప్రతిజ్ఞ చేశాను. దానినిప్పుడు నెరవేర్చకపోతే నాకు అసత్యదోషం కలుగుతుంది దీనికి పరిష్కారమేమిటో నువ్వే చెప్పాలి''. అప్పుడు జగత్కృత్యసాకల్యవేది శ్రీకృష్ణుడిలా ఉపదేశించాడు -

"ఓ పార్థ ! ధర్మము యొక్క సూక్ష్మస్వరూపం చాలా చిత్రమైనది ప్రాణాలకే హాని సంభవించే సమయంలో, సమస్త సంపదలు అపహరింపబడే తరుణంలో అసత్యం పలికినా అది సత్యమే ఔతుంది. అట్టి వేళలో సత్యం పలికినా అది అసత్యంగానే పరిగణింపబడుతుంది".

పై మాటలు చాలా చిత్రంగా ఉన్నాయి. సత్యం అసత్యమెలా ఔతుంది ? అంటే సత్యాసత్యాల ఆచరణ అహింసపైన ఆధారపడి వుందన్నమాట ! సత్యం, అహింస - ఇవి రెండూ మానవత్వపు నీడల్లో చెట్టాపట్టాలేసుకు తిరిగేజంట. ఒకదానికోసం మరొకటి త్యాగం చేసుకునేటంత గాఢమైత్రి వాటిది. కాని విశ్వశ్రేయస్సు దృష్ట్యా సత్యమే అహింసకోసం కరిగిపోవాలి. అసత్యం చెప్పి అయినా సరే హింస జరుగకుండా చూడాలి. సత్యం కోసం ప్రాకులాడి వలుపురి నాశనానికి కారణభూతుడైన ఒక చాదస్తపు విప్రుని కథను శ్రీకృష్ణుడు అర్జునునికిలా చెప్పాడు.

## 28

ఒక నదీసంగమప్రదేశంలో కౌశికుడనే తపస్వి ఒక ఆశ్రమం కట్టుకుని అందు నివసిస్తూండేవాడు. ఒకసారి బందిపోటు దొంగలు కొందరు తరుముతూండగా భయంతో బాటసారులు పరుగుపరుగున వచ్చి ఆశ్రమంలోని పొదల మాటున దాక్కున్నారు. ఇంతలో దొంగలు వచ్చి కౌశికుణ్ణి అడిగారు- "ఇటు వచ్చిన బాటసారులెటు వెళ్ళారు?" అసత్యం చెబితే పాపం చుట్టుకుంటుందేమో యని భయపడి కౌశికుడు సత్యమే చెప్పాడు. దొంగలు వారిని చంపి ధనాన్ని అపహరించుకు పోయారు. ఆ తపస్వి మరణానంతరం నరకలోకం చేరుకున్నాడు.

# మట్టిలో మాణిక్యాలు

నార్ఘన్తి రత్నాని సముద్రజాని
పరీక్షకాః యత్ర న సన్తి దేశే।
ఆభీరపల్ల్యంచిత పద్మరాగమ్
త్రిభిః వరాటైః పణయన్తి గోప్యః॥

జగమెరిగిన పండితరాయలు జగన్నాథుడు ఆయన పండిత సదస్సులో పలికింది శాస్త్రవాక్యమైంది. ఆయన కవి గోష్ఠిలో ఒలికింది కవితామధువయ్యింది. దేశమంతా తిరిగి ప్రజల్నీ, రాజుల్నీ, వారి వ్యక్తిత్వాల మర్మాలను చదివిన సహృదయ చక్రవర్తి కొబట్టి షాజహాన్ ఆస్థానానికే కలికి తురాయిగా వెలిగాడు. ఆయన తన జీవితమనే రసాల ఫలాన్ని పిండి ఒక్కొక్క బొట్టును ఒక్కొక్క శ్లోకంగా "భామినీ విలాసం" అనే కావ్యాన్ని వ్రాశాడు. ఆ కావ్యంలోని ఒక తీయని బిందువే పై శ్లోకం.

"రత్న పరీక్షకులు లేనిచోట సముద్రంలో పుట్టిన రత్నాల కైనా విలువ యెక్కడుంటుంది? వాటిని పెద్దగా పట్టించుకోరు. గొల్లపల్లెలోని పద్మరాగాన్ని అక్కడి గోపికలు మూడు గవ్వలకు అడుగుతారు. అంటే మూడు గవ్వలిచ్చి కొనుక్కోవాలను కుంటారు".

గొప్పతనానికి అంతటా ఆదరముండదు. దాని నెరిగిన వారు మాత్రమే ఆదరిస్తారు మట్టిలో మాణిక్యం లాగ, రాలలో రత్నంలాగ మనలోనే మనమధ్యనే మహనీయులు మసలుతూంటారు. వారిని గుర్తించి గౌరవించటమే సంస్కారవంతుడైన పౌరుని లక్షణం.

కానీ, రత్నాలు రాల మధ్య మెరుస్తూ విశిష్టతను చూపుతాయి ఆ మెరుపులతోనే తమను గుర్తించమన్నట్లుగా లోకానికి బోధిస్తాయి. అలాగే సంఘం తమను గుర్తించి తమ సేవల్ని వినియోగించుకోలేని తరుణంలో నిపుణులు తమ సామర్థ్యాల్ని ప్రదర్శించి గుర్తింపు పొందాలి. సమాజానికి తమ సేవల్ని అందించాలి.

ప్రతిపదార్థం :- యస్త్ర దేశే = ఏ దేశంలో, పరీక్షకాః = రత్నములను పరీక్షించువారు, న సన్తి = ఉండరో. (అక్కడ) సముద్రజాని = సముద్రమందు పుట్టిన, రత్నాని = రత్నములు, న అర్ఘన్తి = విలువ కట్టబడవు, గోప్యః = గోపికలు. ఆభీరపల్లీ + అంచిత పద్మరాగం = గొల్లపల్లెలో దొరకు పద్మరాగమును, త్రిభిః వరాటైః = మూడు గవ్వలతో, పణయన్తి = కొనుచున్నారు.

# దాంపత్యం

అద్వైతం సుఖదుఃఖయో రనుగతం
సర్వాస్వవస్థాసు యత్
విశ్రామో హృదయస్య యత్ర జరసా
యస్మిన్న హార్యో రసః ।
కాలేనావరణాత్యయాత్ పరిణతే
యత్ స్నేహసారే స్థితమ్
భద్రం తస్య సుమానుషస్య కథ
మప్యేకం హి తత్ ప్రాప్యతే ॥

అది భవభూతి కవితా విభూతి

"ఉత్తరరామచరితమ్" అనే నాటకంలోని రసార్ద్ర సన్నివేశమది. గర్భవతియైన సీత శ్రీరాముని ఒడిలో తలనుంచి నిదురిస్తోంది. రాముడామెను ఆప్యాయతతో చూస్తూ తన మనస్సులోని అనంతమైన భావనిధుల్ని ప్రవిప్పిపోస్తున్నాడు ...

"ఆహా! లోకంలో ఈ దాంపత్యానుభవం ఎంత గొప్పది! కష్టసుఖాలలో కలసి ఉండేది, సర్వకాల సర్వావస్థలలో తనను వెన్నంటి అనుసరించేది, బరువెక్కిన గుండెకు ఊరటను కలిగిం

చేది, వయస్సు ఉడిగిపోతున్నా తరగని స్నేహరసానికి నిధి వంటిది, అప్పుడప్పుడూ కాలం సృష్టించే ఆవరణం (ఆచ్ఛాదన అంటే వినియోగరూపమైన అవరోధం) తొలగిపోయినప్పుడు రెట్టింపై మధురమధురంగా పరిణమించే స్నేహసీమలో సంచరించేది, భార్య ఒక్కతే కదా! సందేహంలేదు. కాని అలా బ్రతుకులో బ్రతుకై, వలపువెన్నెల వెలుగై అలరించే భార్యకు అవిచ్ఛిన్నమైన భద్రము అరుదుగా లభిస్తూ ఉంటుంది"

సీత పడిన కష్టాలను స్మరించి రాముడు వ్యక్తం చేసినసహ్మ ఆవేదన ఆ చివరి మాటల్లో తొంగిచూసింది.

అర్థకామాలు ధర్మబద్ధంగా ఉండాలని ప్రబోధించే భారతీయ సంస్కృతిలో ధర్మబద్ధమైన కామమంటే ఆదర్శదాంపత్యమే! అది సమగ్రజీవన మాధుర్యాన్ని గ్రోలటానికి భగవంతుడు జాతికిచ్చిన వరం

ప్రతిపదార్థం :- యత్ .. ఏ వ్యక్తి, సుఖదుఃఖయోః = సుఖదుఃఖములందు, అద్వైతం = వేరు పడకుండునో అనగా కలసి వుండునో, సర్వాసు అవస్థాసు = అన్ని అవస్థలందును, అనుగతం = అనుసరించునో, యత్ర = ఎక్కడ (ఏవ్యక్తివద్ద) హృదయస్య = మనస్సునకు, విశ్రామః = విశ్రాంతి (చేకూరునో) యస్మిన్ = ఏ వ్యక్తియందు, జరసా = ముసలితనముచె

రసః = ప్రేమరసము, న హార్యః = హరించుటకు వీలు కానిదో (అనగా వయస్సు మీరిపోతున్నా శాశ్వతమైన ఆకర్షణను కోల్పోవక ప్రేమరసమును కురిపించు వ్యక్తి), యత్ = ఎవరు, కాలేన = కాలముచే (కాలక్రమముగా) ఆవరణ + అత్యయాత్ = సిగ్గు సంకోచము లేక వియోగము మొదలైన అవరోధములు తొలగి పోవుట వలన, పరిణతే = వృద్ధి జెందిన, స్నేహసారే = స్నేహసారమునందు, స్థితం = ఉండునది (మొదట దంపతుల మధ్యనుండు సిగ్గు, సంకోచము మొదలైన అవరోధములు తొలగిపోయి క్రమక్రమముగా వారి నడుమ చనవు చోటు చేసుకుంటుంది అట్టి స్నేహమునందు ఉండునది అని భావము) తస్య = అటువంటి, సుమానుషస్య = సజ్జనరూపమైన భార్యకు, ఏకం = కేవలము అనగా అవిచ్ఛిన్నమైన, భద్రం = సుఖము కథం + అపి = ఎట్లో అనగా అరుదుగా, ప్రాప్యతే = లభించును (లోకంలో భర్తల వలన ఎడతెగని సుఖమును అందుకొను భార్యలు చాల అరుదుగా ఉందురని భావము).

# ఆశ

ఆశా బలవతీ భీమ! కాచిదాశ్చర్య శృంఖలా।
యయా బద్ధాః ప్రధావన్తి ముక్తాః తిష్ఠన్తి పంగువత్॥
(ఆశ్వమేధపర్వం, 6 అధ్యా. 55 శ్లో)

అది "జైమిని భారతం" లోని ఒక ఆణిముత్యం

కురుక్షేత్ర సంగ్రామం తర్వాత ధర్మరాజు బంధుమిత్ర సంహారపాపాన్ని పోగొట్టుకొనటానికి అశ్వమేధయాగం చేయా లనుకున్నాడు. యజ్ఞాశ్వం "యౌవనాశ్వుడ"నే రాజువద్ద ఉందని తెలుసుకొని అతన్ని జయించి అశ్వాన్ని తీసుకురావటం కోసం భీమసేనుణ్ణి, కర్ణుని పుత్రుడైన వృషకేతుణ్ణి పంపాడు. వారి మధ్య పోరు ఘోరంగా సాగింది యౌవనాశ్వుడు లొంగి పోయాడు. కాని అతనికి శ్రీకృష్ణదర్శనం చేసుకోవాలనిపిం చింది. సపరివారంగా భీమునితో బయలుదేరాడు. అప్పుడు తన నగరంలో అమిత ధనవంతుడైన సుదేవుడనే వాణ్ణి పిలచి "నీతో పాటు సత్పురుషుల్ని, ధార్మికుల్ని ఇతరధనికుల్ని ధర్మరాజు నగరానికి తీసుకొనిరా. అక్కడ గోవింద దర్శనం చేసుకుంటే శ్రేయస్సు కలుగుతుంది" అన్నాడు.

సుదేవుడు యింటికి తిరిగివచ్చి రాజాజ్ఞను తనతల్లికి చెప్పాడు. వృద్ధురాలైన తల్లి విచారించి "నాయనా! మనకు గోవింద

దర్శనం వద్దు .. పుణ్యమూ వద్దు .. అనవసరంగా ధన వ్యయం చేయకు" అని మందలించింది. ఆ మాటలన్నీ సుదేవుడు రాజుకు చెప్పి తాను రాలేనన్నాడు. రాజామెను బంధించి డోలీలో వేయించి తీసుకు రమ్మని పయనమయ్యాడు

ఈ కథనంతా భీమసేనునితో చెపుతూ యౌవనాశ్వుడు ఆశనిలా వర్ణించాడు —

"భీమసేనా ! ఆశ చాలా బలీయమైనది. అదొక వింత సంకెల. అందులో తగుల్కొన్నవారు పరుగెత్తుతారు. ఆశ్చర్యమదే! దాని నుండి విడివడినవారు కుంటివారిలా ఉండిపోతారు"

ఆశ పిశాచి కాకూడదు జీవనగమనంలో ఎదురుదెబ్బలు తగిలినప్పుడు, గుండె నిబ్బరం జారిపోతున్నప్పుడు ఆత్మ విశ్వాసానికి ఊపిరులూది వ్యక్తిత్వానికి సమగ్రతను చేకూర్చే సాధనం ఆశ.

అప్పుడప్పుడూ నిట్టూర్పుల శిశిరంలో వాడిపోబోయే జీవనలతను చిగురింపజేసే సన్నని కోయిల కూజితం "ఆశ".

"భవభూతి" మహాకవికి భవిష్యత్తుపైన ఎంత ఆశ !

యే నామ కేచిదిహ నః ప్రథయన్త్యవజ్ఞామ్
జానన్తి తే కిమపి తాన్ ప్రతి నైష యత్నః ।
ఉత్పత్స్యతే మమ తు కోఽపి సమానధర్మా
కాలో హ్యయం నిరవధిః విపులా చ పృథ్వీ ॥

"మాలతీమాధవం" అనే ప్రకరణంలో (రూపకభేదం) ప్రస్తావనలో మహాకవి సూత్రధారుని ముఖతః యీ మాటల్ని పలికించాడు —

"ఈ సాహిత్యరంగంలో నన్ను అవహేళన చేసే కొందరు విద్వాంసులు ఉంటే ఉందురు గాక! వారికి తెలిసినదేదో తెలుస్తుంది. ఈ నా కావ్యప్రయత్నం వారికోసం కాదు. ఎప్పుడో ఒకనాడు ఎక్కడో ఒకచోట నా సాహిత్యాన్ని అర్థం చేసుకోగల సహృదయుడు జన్మించక పోడు! ఎందుకంటే కాలం అనంతమైనది. భూమి చాలా విశాలమైనది."

ఆ మహాకవి తన జీవితంలో ఎన్ని ఎదురు దెబ్బలు తిన్నాడో! సహృదయత లేని ఎందరు విద్వాంసులు ఆయన నూతన కావ్యధోరణుల్ని గోష్ఠుల్లో దుయ్యబట్టారో! ఈర్ష్యాపంకిలమైన సమాజంలో తన కాలికి బురదను అంటనీయకుండ నిలచి కుహూకుహూగానం చేసిన కవికోకిల "భవభూతి". అందుకే ఆయన ఆత్మ విశ్వాసం అంత రీవిగా అక్షరవీధుల్లో అవతరించగలిగింది.

ప్రతిపదార్థం :- ఇహ = ఇక్కడ (ఈనా కావ్యవిషయంలో) యే నామ కేచిత్ = ఈర్ష్యాళురైన ఎవరో కొందరు, నః = మాకు, అవజ్ఞాం = అవమానమును (అవహేళనను), ప్రథయన్తి = ప్రచారము చేయుచున్నారు, తే = వారు, కిమపి = ఏదియో,

జానన్తి = ఎరుగుదురు, ఏషః యత్నః = ఈ కావ్యప్రయత్నము, తాన్ ప్రతి = వారినుద్దేశించి, న = కాదు, తు = కాని, మమ = నాకు, సమానధర్మా = సమానమైన ధర్మముగల, కః + అపి = ఒకానొకడు, ఉత్పత్స్యతే = జన్మించును, హి = ఎందుకనగా, అయం కాలః = ఈ కాలము, నిరవధిః = అనంతమైనది, చ = మరియు, పృథ్వీ = భూమి, విపులా = విశాలమైనది.

# సరిలేనివి

జరాసమా నా స్త్యమృజా ప్రజానామ్
వ్యాధేః సమో నాస్తి జగత్యనర్థః।
మృత్యోః సమం నాస్తి భయం పృథివ్యామ్
ఏతత్ త్రయం ఖల్వవశేన సేవ్యమ్॥

అశ్వఘోషుడు సంస్కృతవాగ్విపంచిపై రమ్యరాగాలను పలికించిన సాహిత్యకళాధరుడు. ఆయన సృష్టించిన "సౌందర నందమ్" అనే అనర్ఘకావ్యరత్నం మనుష్యలోకానికి చీకటినుండి వెలుగులోనికి వెళ్ళే దారిని నిర్దేశిస్తుంది.

అనంతములైన భోగాలకు ఫలితం దుఃఖమే. అది జీవన కోణాల్లో దట్టంగా ముసిరే చీకటి ఆ చీకటినుండి బయటపడటం అందరికీ సాధ్యంకాదు. అందులోనూ నందుడంత భోగలాలసునికా? ఊహుఁ ...

సిద్ధార్థుని తమ్ముడు నందుడు. వాని భార్య "సుందరి" పేరుకు తగ్గట్టుగానే అతిలోకసుందరి. అందుకే నందుని కలలన్నీ సుందరి కన్నుల నీడల్లో కాపురం చేస్తున్నాయి. వారికి కాలం కర్పూరంలా కరిగిపోతోంది. ప్రతిక్షణమూ మధుమాసమే ...

ఇంతలో ఒకనాడు బుద్ధుడు నందుని భవనం ముందు నిలబడి "భవతి భిక్షాందేహి" అని గంభీరంగా పలికాడు. ప్రియురాలి పెదవుల సోయగాల్ని పరికిస్తూ పరవశిస్తున్న నందుడికి బుద్ధుని మాటలు వినిపిస్తాయా ?

బుద్ధుడక్కడనుంచి ముందుకు కదిలాడు పరుగుపరుగున వచ్చి పరిచారిక తెలిపింది - "తథాగతుడు వచ్చాడు, వెళ్ళి పోయాడు" అది విని నందుడు అన్నగారిపైన గౌరవంతో, సుందరిని వదలలేని ప్రేమబంధంతో నిలబడలేక, ముందుకు సాగలేక తరంగాలపై తేలియాడే రాజహంసలాగ సందిగ్ధ మనస్కుడైనాడు. ఎలాగో చివరకు ఆ ముడి తెగిపోయింది. స్వేచ్ఛా విహంగమై వచ్చి బుద్ధునివద్ద దీక్షను స్వీకరించాడు.

అప్పుడు బుద్ధుడు నందునికిలా ఉపదేశించాడు—

"ముసలితనంతో సమానమైన మురికిలేదు వ్యాధితో సమానమైన అనర్థమూ లేదు. మృత్యువుతో సమానమైన భయం లేదు. ఆ మూడింటినీ అంటే ముసలితనాన్ని, వ్యాధిని, మృత్యువునూ వివశుడే పొందుతూంటాడు.

తనకు తాను వశుడు కాక, వివిధమోహాలకు లోబడి ప్రవర్తించేవాడు వివశుడు. అటువంటివాడినే ముసలితనమైనా, వ్యాధియైనా, మృత్యువైనా దరిజేరేది.

ముసలితనం మురికివంటిది. మురికి ఉన్నచోట క్రిములు ముసురుతాయి. రోగాలు కలుగుతాయి. అది సహజం ... అలాగే ముసలితనంతోనే అన్నిరకాల అవగుణాలు అబ్బుతాయి. ధైర్యాన్ని కలిగి ఉన్నంతకాలం యౌవనమున్నట్లే! దాన్ని కోల్పోయినప్పుడు, ఆత్మవిశ్వాసం జారిపోయినప్పుడు ముందు మనస్సులో, తర్వాత దేహంలో ముసలితనం అడుగుపెడుతుంది

మృత్యువుకూ, భయానికీ ఒక సమానధర్మముంది. అది వెంటనంటి ఉండటం. అందుకే మృత్యువుతో సమానమైన భయం లేదు.

కాబట్టి యివన్నీ అసమానములైన అవగుణాలు.

ప్రతిపదార్థం :- ప్రజానాం = ప్రజలకు, జరాసమా = ముసలితనముతో సమానమైన, అమృజా = మురికి ("మృజా" అనగా సుగంధద్రవ్యములతో మర్దించి దేహమును స్నానము చేయించుట అనగా శుభ్రత), న అస్తి = లేదు, జగతి = లోకమున, వ్యాధేః = వ్యాధికి, సమః = సమానమైన, అనర్థః = ఆపద, న అస్తి = లేదు, పృధివ్యాం = భూమిపై, మృత్యోః = మృత్యువునకు, సమం = సమానమైన, భయం = భయము, న అస్తి = లేదు, ఏతత్ = ఈ, త్రయం = మూడు, అవశేన = తనను తాము వశీకరించుకొనలేని వానిచే, సేవ్యం = సేవింపదగినవి (పొందబడును)

# గుణాలే ప్రధానం

గుణేష్వేవాదరం కుర్యాత్
న జాతౌ జాతు తత్త్వవిత్।
ద్రౌణిః ద్విజోఽభవత్ శూద్రః
శూద్రశ్చ విదురః క్షమీ ॥

అది క్షేమేంద్రుని "చారుచర్య"లోని సూక్తిసుధాబిందువు. జాతి కన్న గుణం ప్రధానమా? గుణం కన్న జాతి ప్రధానమా? ఈ చర్చ తెగని తీగ. జాతిఅంటే కులమన్నమాట। కులం గుణప్రధానంగా ఏర్పడింది "గుణకర్మ విభాగశః" అని గీతాకారుడన్నట్లుగా గుణాల్ని అనుసరించి కులాలు ఆవిర్భవించాయి. అందువలన హేతువైన గుణంప్రధానమైనది

"తత్త్వము నెరిగినవాడు గుణముఅందు ఆదరమును ఉంచవలెను. అంతే కాని జాతిని మాత్రమే ఆదరించరాదు. ద్రోణుని కుమారుడైన అశ్వత్థామ బ్రాహ్మణ జాతిలో ఉద్భవించినా కోపం, క్రౌర్యం మొదలైన గుణాలచే బ్రాహ్మణత్వాన్ని

కోల్పోయాడు. శూద్రస్త్రీకి జన్మించినప్పటికీ విదురుడు క్షమాశీలుడై నీతికోవిదుడై బ్రహ్మవేత్త అయ్యాడు.''

ప్రతిపదార్థం :- తత్త్వవిత్ = తత్త్వము నెరిగినవాడు, గుణేషు + ఏవ = గుణములందే, ఆదరం = ఆదరమును, కుర్యాత్ = చేయవలెను, జాతు = ఏనాడు, జాతౌ = జాతిపై, న కుర్యాత్ = ఆదరము నుంచరాదు, ద్విజః = బ్రాహ్మణుడైన, ద్రౌణిః = ద్రోణకుమారుడైన అశ్వత్థామ, శూద్రః అభవత్ = శూద్రుడయ్యెను, చ = మరియు, శూద్రః = శూద్రుడైన, విదురః = విదురుడు, క్షమీ = క్షమాశీలుడు.

# పన్నుల వసూళ్ళు

పరిపాలనారంగంలో పన్నుల్ని విధించటం, వాటిని వసూలు చేయుటం చాల ప్రధానమైన అంశం. పన్నుల ప్రభావం ప్రజలపైన ఎంతైనా ఉంటుంది. పన్నుల్ని తక్కువగా విధిస్తే ప్రజలు రాజును మెచ్చుకుంటారు. అవి మోయలేనంత భారమైతే ద్వేషిస్తారు. కాబట్టి యింత సున్నితమైన అంశాన్ని పరిపాలకులేవిధంగా గ్రహించాలో మన ప్రాచీనులైన ఋషులు బోధించింది సర్వకాలసమాదరణీయం.

మధుదోహం దుహేత్ రాష్ట్రం
భ్రమరాః ఇవ పాదపమ్ ।
వత్సాపేక్షీ దుహేచ్చైవ
స్తనాంశ్చ న వికుట్టయేత్ ॥

జలౌకావత్ పిబేత్ రాష్ట్రం
మృదునైవ నరాధిపః ।
వ్యాఘ్రీవ చ హరేత్ పుత్రాన్
సందశేన్న చ పీడయేత్ ॥

మణిపూసల్లాంటి ఆ రెండు శ్లోకాలు మహాభారతంలో శాన్తి పర్వంలో 8 వ అధ్యాయంలోనివి.

కురుక్షేత్రంలో నేలకొరిగిన భీష్ముడు ఉత్తరాయణం కోసం ఎదురుచూస్తూ అంపశయ్యపై పరుండిన సమయంలో యుధిష్ఠిరుడు వచ్చాడు. ఎన్నో సందేహాల్ని వెలిబుచ్చాడు, సర్వజ్ఞుడైన గాంగేయుడు ధర్మజునికి అనేక శాస్త్ర రహస్యాల్ని తెలిపాడు.

అప్పుడు ధర్మరాజు భీష్ముణ్ణి అడిగాడు — "తాతా ! రాజు తన ఖజానాను నింపటానికి ప్రజల నుండి పన్నుల్ని వసూలు చేసే విషయంలో ఎలా ప్రవర్తించాలి ?"

దానికి సమాధానంగా భీష్ముడిలా పలికాడు - "నాయనా! రాజు ప్రజల్ని నొప్పించక పాలించాలి. రావలసిన పన్నుల్ని రాబట్టాలి. ప్రజలకు పన్నులు భారం కాకూడదు. ప్రజల్ని ఒక్కసారి పీల్చి పిప్పి చెయ్యగూడదు".

"తుమ్మెదలు చెట్ల పూల నుండి తేనెను సున్నితంగా కొద్ది కొద్దిగా గ్రోలునట్లు, ఆవు పొదుగును లాగి లాగి హింసించకుండా తగుమాత్రం పాలనే పిదుకునట్లు రాజు ప్రజల నుండి పన్నుల్ని వసూలు చేయాలి జలగ బాధను కలిగించకుండగా ప్రాణి రక్తాన్ని పీలుస్తుంది. ఆడుపులి తన పిల్లల్ని నోటితో కరచుకొని పోతుంది. కాని వాటికి బాధ కలుగనే కలుగదు. అలాగే రాజు

ప్రజల నుంచి కోమలంగా, నయంతో భయంతో కొద్దికొద్దిగా పన్నులన్ని గ్రహించి కోశసంపదను పెంపొందించాలి".

ప్రతిపదార్థం :- పాదపం = చెట్టును, భ్రమరాః ఇవ = తుమ్మెదల వలె, మధుదోహం = తేనెను పిదుకునట్లు, రాష్ట్రం = రాజ్యమును, దుహేత్ = పిదుకవలెను (పన్నుల రూపముగా ధనమును గ్రహించవలెను), వత్స + అపేక్షీ = దూడను కోరువాడు (అనగా దూడ యొక్క క్షేమమును కోరువాడు), దుహేత్ + ఏవ = వచ్చునంత వరకే పిదుకవలెను, స్తనాన్ = పొదుగును, న వికుట్టయేత్ = లాగకూడదు, నరాధిపః = రాజు, జలౌకావత్ = జలగవలె, రాష్ట్రం = రాజ్యమును, మృదునా + ఏవ = సున్నితముగానే, పిబేత్ = త్రాగవలెను (పన్నుల రూపముగా ధనమును గ్రహించవలెను), చ = మరియు, వ్యాఘ్రీ + ఇవ = ఆడుపులి వలె, పుత్రాన్ = పుత్రులను (పులి పక్షంలో, ప్రజల్ని (రాజు పక్షంలో), హరేత్ = కొనిపోవలెను, న సందశేత్ = కరవగూడదు, చ = మరియు, న పీడయేత్ = బాధింపగూడదు.

# పాత - క్రొత్త

పురాణమిత్యేవ న సాధు సర్వమ్
న చాపి కావ్యం నవమిత్యవద్యమ్ ।
సన్తః పరీక్ష్యాన్యతరద్భజన్తే
మూఢః పరప్రత్యయనేయబుద్ధిః ॥

మహాకవి కాళిదాసుని అభిప్రాయమలా అవతరించింది. "మాలవికాగ్నిమిత్రమ్" అనే నాటకంలో సూత్రధారుడు "నూతన కావ్యం సామాజికుల మనస్సుల్ని ఆకట్టుకుంటుందా ?" అని తనను నిగ్గదీసి అడిగిన పారిపార్శ్వకునితో (ప్రక్కనుండు వానితో) యిలా అన్నాడు —

"పురాణ వాఙ్మయమంతా శుద్ధమైనదనరాదు, అలాగే నూతనమైనది కదా అని కావ్యరాశినంతా నిందించనూ కూడదు. సరైన విమర్శకుడు రెంటినీ పరీక్షించి ఏది సాధువో దాన్ని గ్రహిస్తాడు. కాని మూఢుడు పరుల సలహాలను బట్టి విలువల్ని తెలుసుకుంటాడు"

"పాత రోత - క్రొత్త వింత" అనే సామెత ఉంది. పాతదంతా రోతగా ఉంటుంది. క్రొత్తదనం కొన్నాళ్ళు వింతగానే

తోస్తుంది. మరికొన్నాళ్ళకది పాతదై పోతుంది. అది మళ్ళీ రోతగానే ఉంటుంది. ఈ విధంగా కాలచక్రంలో క్రొత్త-పాతల విలువలు అనిశ్చితాలై అర్థాన్నుల్ని మురిపిస్తూ తమ దారిని తాము సాగిపోతాయి. కాబట్టి "పాత" లోని పరువాన్ని "క్రొత్త" బాటలో కొసరి కొసరి వెన్నెలపాటగా వెలయించి నూతనశకాన్ని ఆరంభించటం వివేకవంతుని లక్షణం. ఇది చారిత్రిక సత్యం. ఏ నవ్యమార్గమైనా ప్రాచీనతలో ఊపిరి తీసుకున్నదే !

ప్రతిపదార్థం :— పురాణమ్ + ఇతి = పురాణము అని (పురాణమనే కారణము వలన), సర్వమ్ + ఏవ = అంతయూ (పురాణవాఙ్మయమంతయు), న సాధు = శుద్ధము కాదు (ప్రశంసార్హము కాదు), చ మరియు, కావ్యమ్ + అపి - కావ్యము కూడ, నవమ్ + ఇతి = క్రొత్తది అని, న అవద్యం = నిందింపదగినదు, సన్తః = సత్పురుషులు, పరీక్ష్య = గుణ దోషములను బాగుగా విచారించి, అన్యతరత్ = పురాణకావ్యములలో ఒకదానిని, భజన్తే = గ్రహించుచున్నారు, మూఢః = మూర్ఖుడు, పర = ఇతరుని యొక్క, ప్రత్యయ = విశ్వాసముచేత, నేయ = పొందింపబడిన, బుద్ధిః = జ్ఞానము కలవాడు (అనగా పరుల విశ్వాసమును బట్టి ప్రామాణికతను తెలుసుకొనువాడు).

# పాత్రవిశేషం

విద్య గరపటం రెండు రకాలుగా ఉంటుంది– ఒకటి మొద్దునైనా వివేకవంతుణ్ణి చేయుటం, రెండు తాను బోధించే విద్య పాత్రనుబట్టి అంటే గ్రహించే వ్యక్తినిబట్టి వారియందు ఉనుమడింపజేయటం. మొదటి పద్ధతి చాల శ్రమతో కూడింది. జగన్నాథ పండితరాయలన్నట్లుగా– "పాషాణాదపి పీయూషం స్యందతే యస్య లీలయా" అదొక అధ్యాపన పద్ధతి. "ఎవని సామర్థ్యం రాతినుంచైనా అమృతాన్ని పిండగలుగుతుందో అతను అసలైన గురువు" అంటే నిశితమైన బుద్ధివైభవం లేని వానినైనా వివేకవంతునిగా మలచగలవాడు ఆచార్యుడని అభిప్రాయం. అంతేకాని అసాధారణ ప్రతిభావంతునిగా తీర్చి దిద్దలేడు ఎంతటి గొప్ప గురువైనా. ప్రతిభ సహజసిద్ధమైనది" అది బహిర్గతం కావాలంటే మహనీయుడైన ఒక గురువు వద్ద శిక్షణ లభించాలి. గుణశాలియైన ఆచార్యుని అమృతవాక్కు శిష్యునిలో దాగిన ప్రతిభాబీజాన్ని అంకురింపజేస్తుంది. అందుకే కాళిదాసు అంటాడు —

"పాత్రవిశేషే న్యస్తం గుణాన్తరం వ్రజతి శిల్పమాధాతుః।
జలమివ సముద్రశుక్తౌ ముక్తాఫలతాం పయోదస్య॥"

అగ్నిమిత్రుని రాణి ఇరావతి. ఆమె తమ్ముడైన వీర సేనుడు "అంతపాల" దుర్గాన్ని రక్షిస్తున్నాడు. వీరసేనుడు "మాలవిక" అనే అందాల బరిణెను తన కూతురని చెప్పి అక్క గారికి ఉపాయనంగా పంపాడు రాణి మాలవికను నాట్యకళా కుశలను చేయదలచి గణదాసుడనే నాట్యాచార్యుని వద్దకు పంపింది. గణదాసుడు తన శిష్యురాలి తెలివితేటలకు ముగ్ధు డయ్యాడు. ఒకరోజు రాణిగారి పరిచారిక "వకుళావలిక"తో తన శిష్యురాలి విద్యావిశేషాల్ని చెప్పుతూ తనకు తెలివైన విద్యార్థిని లభించినందుకు ఆనందంతో యిలా అన్నాడు —

"విశిష్ట గుణశాలియైన శిష్యునికి ఉపదేశింపబడిన విద్య యినుమడిస్తుంది. మబ్బునుండి జారిన నీటి బిందువు సముద్ర మందలి ముత్యపుచిప్పలో పడి ముత్యమగుట లేదా"

మబ్బుతునక జార్చిన నీటి బిందువులు ఎన్నిచోట్ల పడినా, సముద్రంలో ముత్యపు చిప్పలో పడినప్పుడే ఆ జల బిందువు ముత్యమై వెలివెలుగుల్ని వెదజల్లుతుంది.

ఆచార్యుడెందరికి విద్యను బోధించినా, నిశితబుద్ధియైన శిష్యునికి లేక శిష్యురాలికి బోధించింది యినుమడించి నిత్య ప్రత్యగ్రమై మన్ననలను అందుకుంటుంది.

50

ప్రతిపదార్థం :- పాత్రవిశేషే = విశిష్టగుణములు గల శిష్యుని యందు, న్యస్తం = ఉంచబడిన, ఆధాతుః = ఉపదేశకుని యొక్క, శిల్పం = విద్య, సముద్రశుక్తౌ = సముద్రమునందలి ముత్యపు చిప్పయందు, పయోదస్య = మేఘము యొక్క, జలం = నీరు, ముక్తాఫలతాం వ్రజతి ఇవ = ముత్యమగునట్లు, గుణాన్తరం వ్రజతి = గుణాతిశయమును పొందును (అనగా యినుమడించునని భావము)

# పరోపకారం

భవన్తి నమ్రాస్తరవః ఫలోద్గమైః
నవాంబుభిర్దూరవిలంబినో ఘనాః
అనుద్ధతాః సత్పురుషాః సమృద్ధి
స్వభావ ఏవైష పరోపకారిణామ్॥

ప్రపంచ ప్రఖ్యాతమైన నాటకం "అభిజ్ఞానశాకున్తలం" అందించిన అమృతపు గుళిక అది.

దుష్యంతుడు వేటకై అడవికి వచ్చి శకుంతల్ని కలిసి తన నగరానికి తిరిగి వెళ్ళిపోయాడు మళ్ళీ వచ్చి తీసుకు వెడతానని వాగ్దానం చేశాడే కాని ఎందుకో మరచిపోయాడు. దుర్వాసుడు శకుంతలను శపించిన ఫలితమే కారణం

కాలం గడచిపోతున్నా దుష్యంతుని జాడ లేదు. అందుకే కణ్వమహర్షి శకుంతలను దుష్యంతుని వద్దకు సాగనంపాడు కన్నీటి జడులతో తండ్రిలా, తల్లిలా....

శకుంతల వెంట "గౌతమి" అనే తపస్విని, శార్ఙ్గరవుడు, శారద్వతుడు, పురోహితుడు ఉన్నారు. అందరూ రాజసభలోనికి

ప్రవేశించారు. మునుల్ని చూచి రాజు గౌరవంతో లేచి నిలబడి స్వాగతించటానికి ఉద్యుక్తుడౌతున్నాడు. అది చూసి పురోహితుడు "చూడు శార్ఙ్గరవ ! రాజెంత మర్యాదాభిజ్ఞుడో కదా !" అన్నాడు. శార్ఙ్గరవుడు చిరునవ్వు నవ్వి "పూజ్యుడా ! రాజు ప్రవర్తన అభినందనీయమే ! కాని అంతగా ఆశ్చర్యపోవలసిన పని లేదు. ఎందుకంటే పరోపకారుల సహజలక్షణమది" అంటూ యింకా యిలా వివరించాడు —

"పండ్ల ఉత్పత్తి పెరిగిన కొలదీ చెట్లు మరింత వంగుతాయి. వర్షపు నీటితో నిండిన మేఘాలు ఆకాశంలో చాల దూరం వరకు వ్యాపిస్తాయి అలాగే సత్పురుషులు కూడ సంపదలు పెరిగినప్పటికి వినయవంతులుగానే ఉందురు. ఔదార్యమును విడచిపెట్టరు. ఇది పరోపకారుల సహజస్వభావము".

మనకు ప్రకృతి ఎన్నోపాఠాలు నేర్పుతుంది అంటున్నాడు కవి. నిజమే ! చెట్లను చూడు.... పండ్లు పెరిగినకొద్దీ చెట్లు యింకా వంగి వంగి మనకు చేరువౌతాయి. మేఘాల్ని చూడు ... జలభరములైనప్పటికి అవి ఆకాశమంతా సంచరిస్తూ నేలపై అంతటా వర్షధారల్ని కురిపించటానికి ఉరకలు వేస్తాయి. అలాగే పరోపకారులు కూడ సంపదలు తమనెంత వరించినా ఎగిరెగిరి పడరు. ఇంకా ఇంకా వినయ సంపన్నులై ఔదార్యాన్ని ప్రకటిస్తారు. అది పరోపకారుల సహజలక్షణం.

ప్రతిపదార్థం :- తరవః = చెట్లు, ఫల + ఉద్గమైః = పండ్ల ఉత్పత్తులచేత, నమ్రాః = వంగినవి, భవన్తి = అగుచున్నవి, ఘనాః = మేఘములు, నవ + అంబుభిః = క్రొత్త నీటిచేత, దూరవిలంబినః = చాల దూరము వరకు (ఆకాశమున) వ్యాపించినవి (అగుచున్నవి), సత్పురుషాః = సత్పురుషులు, సమృద్ధిభిః = సంపదలచే, అనుద్ధతాః = తీక్ష్ణస్వభావులు కారు, ఏషః = ఇది, పర + ఉపకారిణాం = పరులకు ఉపకరించు వారి యొక్క, స్వభావః ఏవ = స్వభావమే (అనగా సహజమైనదే!)

# క్షేత్రమహిమ

చీయతే బాలిశస్యాపి
సత్క్షేత్ర పతితా కృషిః ।
న శాలేః స్తంబకరితా
వప్తుః గుణమపేక్షతే ॥

సాంఘికము, చారిత్రకమునైన విలువగల సంస్కృత నాటకాలలో "ముద్రారాక్షసమ్" ఒకటి క్రీ శ. ఆరవ శతాబ్దికి చెందిన "విశాఖదత్తుడు'' సాహితీ ప్రియుల కందించిన అపూర్వ-రూపక కళాఖండమది

నాటకారంభంలో సూత్రధారుడు సభనొక్కసారి కలయ జూసి ఆనందభరితుడయ్యాడు. "సహృదయ శేఖరులు గల యీ సభలో నాటకాన్ని ప్రయోగించుట నా అదృష్టమే" అనుకుంటాడు. ఎందుకంటే ...

''విత్తులు చల్లినవాని తెలివిని బట్టి పంట అభివృద్ధి చెందుతుందా ? మంచి పొలంలో పడిన గింజకు చల్లినవాని తెలివితో పనేముంది ? అది పొలంలోని గుణముచేత చక్కగా ఎదిగి దంటు వారుతుంది. మంచి కాపు కాస్తుంది''.

అది ఒక్క పొలం సంగతే కాదు, మానవుల జీవన సత్యం కూడా అదే. గుణశాలియైన విద్యావంతుడు వెలుగులోనికి రావాలంటే గుణగ్రహణ పారీణులైన వారి మన్నన లభించాలి. సహృదయుల అభినందన సత్క్షేత్రం వంటిది అక్కడ ఊపిరి తీసుకున్న కృషి (Constant practice of art and science) ప్రవర్ధమానమై, సఫలమై సమగ్రతను సంతరించుకుంటుంది.

కాబట్టి కృషి చేసే ఏ విద్యావంతుడైనా, కళాకారుడైనా, ముందుగా గుణగ్రాహులైన విబుధవరుల ఎదుట తమ నైపుణ్యాన్ని ప్రదర్శించి గుణదోషాలను తెలుసుకోవాలి పల్లవించిన ఏ విద్య అయినా ప్రశంసలేనిదే పుష్పించదు, ఫలించదు!

ప్రతిపదార్థం :- బాలిశస్య అపి = ఎరుగని వాని యొక్క యు, కృషిః = సేద్యము, సత్క్షేత్రపతితా = మంచి పొలాన పడినట్టిది, వియతే = అభివృద్ధి చెందును, శాలేః = వరి యొక్క, స్తంబకరితా = లావుదంటగుట, వప్తుః = చల్లిన వాని యొక్క, గుణం = శక్తిని లేక నేర్పును లేక తెలివిని, న అపేక్షతే = కోరదు.

# సహృదయత

గుణానాం వా విశాలానామ్
సత్కారాణాం చ నిత్యశః ।
కర్తారః సులభాః లోకే
విజ్ఞాతారస్తు దుర్లభాః ॥

భాసమహాకవి రచించిన "స్వప్నవాసవదత్తమ్" అనే నాటకం సుమధుర రసవాహిని మాత్రమే కాదు, అది అమూల్యములైన నీతివాక్యాలకు నిధి. ఆ నాటకంలోని రెండు శ్లోకాలు చాలా సుప్రసిద్ధాలు. వాటిలో ఒకటి పై శ్లోకం. అది సహృదయతను, విజ్ఞతను చాటుతుంది.

మగధదేశాధిపతి "దర్శకుడు". అతని చెల్లెలు పద్మావతి. వత్సదేశపు రాజైన ఉదయనుడు పద్మావతిని వరించాడు. ఒక రోజు యిద్దరూ తోటలో విహరిస్తున్నారు. ఇంతలో విదూషకుడు ఉదయనునికి గుర్తుచేశాడు - "మిత్రమా ! మగధరాజు నూతన వరుడవైన నిన్ను వెంట బెట్టుకుని వెళ్ళి మిత్రుల్ని కలవాలనుకుంటున్నాడు. ఈ వార్త నీకు తెలిసిందే కదా ! ఆలస్యమెందుకు? ఆ సమయమాసన్నమైంది. ఇక లే" అప్పుడు ఉదయనుడు సంతోష భరిత హృదయంతో అన్నాడు —

"నిజమే మిత్రమా! వెళ్ళాలి. నిండు మనస్సుతో ఆదరించుట కన్న వేరే సత్కారమేమున్నది? కాని ఆ సత్కారాన్ని అందుకోవటం ఎంతమందికి తెలుసు. ఎందుకంటే —

లోకంలో పరోపకారం మొదలైన విశాలములైన గుణాలను కలిగినవారు, పరులను సత్కరించేవారు సులభంగానే దొరుకుతారు. కానీ సహృదయతతో పరగుణాలను, పరులందించే సత్కారాలను స్వీకరించేవారు అరుదుగా ఉంటారు".

ప్రతిపదార్థం :— లోకే = లోకమునందు, నిత్యశః = ఎల్లప్పుడు అనగా ఎడతెగక, విశాలానాం = ఉదాత్తములైన, గుణానాం = గుణముల యొక్క, చ = మరియు, సత్కారాణాం వా = సత్కారముల యొక్క గాని, కర్తారః = ప్రయోజకులు (అనగా కలిగిన వారు) సులభాః = అధికముగా కనిపించెదరు, తు = కాని, విజ్ఞాతారః = వానిని (ఆ గుణములను, సత్కారములను) తెలసుకొనువారు, దుర్లభాః = అరుదుగా లభించెదరు.

# కాలలీల

కః కం శక్తో రక్షితుం మృత్యుకాలే
రజ్జుచ్ఛేదే కే ఘటం ధారయన్తి ?
ఏవం లోకః తుల్యధర్మో వనానామ్
కాలే కాలే చిద్యతే రుహ్యతే చ ॥

భాసుడెంత సహజంగా పలికాడు !

ఉదయనుడు ఉజ్జయినీ రాజకుమారియైన వాసవదత్తను వివాహమాడాడు వారికి రోజులు మధురమధురంగా గడచి పోతున్నై. ఇంతలో శత్రురాజుల ముట్టడి వలన ఉదయనుడు కొంత రాజ్యాన్ని కోల్పోయాడు బుద్ధి కుశలతగల మంత్రియైన యౌగంధరాయణుడు శత్రువుల్ని జయించుటకొరకు రాజునకు మగధదేశాధిపతియైన దర్శకునితో సంబంధ బాంధవ్యాలను ఏర్పచాలని భావించాడు. ఒక ఐంద్రజాలికుని సహకారంతో "లావాణక"మనే గ్రామంలో రాజు వేటకు వెళ్ళినప్పుడు అంతఃపురానికి నిప్పంటుకుందని, వాసవదత్త అందులో మరణించిందని నమ్మించాడు. తర్వాత దర్శకుడు తన చెల్లెలైన పద్మావతిని ఉదయనునకిచ్చి వివాహం జరిపించాడు. దర్శకుని సహాయంతో రాజ్యాన్ని మళ్ళీ పొందగలిగాడు.

కానీ తన మనసును దోచుకున్న వలపులరాణి వాసవదత్తను మరువలేక దుఃఖిస్తుంటే, సన్నిహితుడైన ఒక సేవకుడు ఉదయనుణ్ణి యిలా ఊరడించాడు -

"ఓ మహారాజ ! మృత్యు సమయంలో ఎవరు ఎవరిని రక్షింపగలరు ? బావిలోనుండి నీటిని తోడుతుంటే త్రాడు త్రెగిపోగా కడవను పట్టుకొనగలవారెవ్వరు ? ఈ లోకధర్మం అడవుల తీరుతో పోలి వుంటుంది. నరుకబడిన అడవులు మళ్ళీ చిగురిస్తాయి. చిగురించిన చెట్లు మళ్ళీ శిథిలములౌతాయి. అట్లే జన్మనెత్తినవాడు మరణించక తప్పదు అది సహజమైన లోకధర్మం"

ప్రతిపదార్థం :- మృత్యుకాలే = మృత్యుసమయమున, కం = ఎవనిని, రక్షితుం = కాపాడుటకు, కః = ఎవడు, శక్తః = సమర్థుడు, రజ్జుచ్ఛేదే = త్రాడు త్రెగిపోగా, కే = ఎవరు' ఘటం = కడవను, ధారయన్తి = పట్టుకొనగలరు ? ఏవం = ఈవిధముగా, లోకః = లోకము, వనానాం = అడవులతో, తులిత ధర్మః = సమానమైన ధర్మముగలది, కాలే కాలే = ఆయాకాలము లందు, ఛిద్యతే = నరుకబడును, చ = మరియు, రుహ్యతే = చిగురించును.

# విధివిలాసం

ద్వీపాదన్యస్మాదపి
మధ్యాదపి జలనిధేః దిశోఽప్యన్తాత్ ।
ఆనీయ ఝటితి ఘటయతి
విధిరభిమతమభిముఖీభూతః ॥

హర్షవర్ధముని (క్రీ. శ. 606 - 646) "రత్నావళి" అనే నాటికలో సూత్రధారుని మాటలివి.

సింహళదేశపు రాజు కూతురు "రత్నావళి". "ఆమెను వివాహమాడిన వాడు చక్రవర్తి ఔతాడు" అని ఒక సిద్ధుడు చెప్పగా విన్నాడు యౌగంధరాయణుడు. అతను వత్సదేశపు రాజైన ఉదయనుని మంత్రి. రాజు సంక్షేమమే తన క్షేమంగా, రాజు పొందే అభివృద్ధి తనకు సంతోషకరంగా భావించి పరవశించే ప్రభుభక్తి పరాయణుడు యౌగంధరాయణుడు. అందువల్లనే రత్నావళిని చేపట్టి తన ప్రభువు చక్రవర్తి కావాలని కోరుకున్నాడు. వెంటనే సింహళాధీశునికి కబురంపాడు. కాని తన కూతురు వాసవదత్తకు సవతి కావటం సింహళరాజైన "విజయబాహువు"నకు యిష్టం కాదు. అతను తన అసమ్మతిని తెలిపాడు.

యౌగంధరాయణుడు మళ్ళీ తన బుద్ధికౌశలాన్ని ప్రదర్శింప వలసిన అవసరం వచ్చింది. వాసవదత్త నీటిలో మునిగి మరణించిందని వదంతి పుట్టించి నమ్మించాడు. సింహళరాజు అది నమ్మి రత్నావళిని ఉదయనునికి ఇవ్వటానికి ఒప్పుకున్నాడు రత్నావళి కొంత పరివారంతో ఓడలో వస్తోంది. సముద్ర మధ్యంలో ఓడ పగిలిపోయింది అందరూ మరణించారు రత్నావళి తప్ప. ఇంతలో రత్నావళికి ఒక చెక్కముక్క దొరికింది. వత్సదేశీయుడైన ఒక వ్యాపారి ఓడలో అటువస్తూ రత్నావళిని రక్షించి కౌశాంబీ నగరానికి (వత్సదేశపు రాజధాని) తెచ్చి రాజునకు అప్పగించాడు. అలా కలుసుకున్నారు వారిద్దరూ ఎంత విచిత్రం విధిఘటన !

అందుకే సూత్రధారుడు "ప్రస్తావన"లో విధివిలాసాన్ని వర్ణించాడు —

"మనం కోరుకున్నది ద్వీపాంతరంలో ఉన్ననూ, సముద్ర మధ్యంలో ఉన్ననూ, దిక్కుల చివర ఉన్ననూ, విధి అనుకూలిస్తే అది మన వద్దకు చేరుతుంటుంది. విధి దాన్ని వెంటనే మనతో కలుపుతుంది''.

ప్రతిపదార్థం :- అభిముఖీభూతః = అనుకూలమైన, విధిః = భాగ్యము, అన్యస్మాత్ = వేరొక, ద్వీపాత్ అపి = ద్వీపము నుండియైనను, జలనిధేః = సముద్రము యొక్క, మధ్యాత్ అపి = నడుమ నుండియైనను, దిశః = దిక్కుయొక్క, అంతాత్ అప = చివరనుండియైనను, అభిమతం = ఇష్టమైనదానిని, ఝటితి = వెంటనే, ఆనీయ = తెచ్చి, ఘటయతి = కలుపును.

# క్షేమేంద్రుని రుచిరోక్తులు

క్షేమేంద్రకవీంద్రుడు కాశ్మీరరాజైన అనంతుని (క్రీ. శ. 1029-1064) ఆస్థానాన్ని అలంకరించి అమూల్యములైన కృతి రత్నాలను సంస్కృత సరస్వతికి కానుకలుగా అందించాడు. ఆయన కావ్యాలలో "చారుచర్య" అనే నీతికావ్యం సముదాత్త-జీవనగతిని సులభసుందరశైలిలో వివరిస్తుంది దానిలోని కొన్ని వెలుగురేకలివి -

త్యాగే సత్త్వనిధిః కుర్యాత్
న ప్రత్యుపకృతి స్పృహామ్ ।
కర్ణః కుండలదానేభూత్
కలుషః శక్తియాచ్ఞయా ॥

కవి త్యాగమంటే ఏమిటో వివరించాడు. సత్త్వగుణం గల వ్యక్తి ప్రత్యుపకారాన్ని కోరకుండా త్యాగం చెయ్యాలి. "నేనిది త్యాగం చేస్తే నాకేమిటి లాభం ?" అని ఆశించకుండగా

నిష్కామంగా నిర్మలభావంతో త్యాగం చేయాలి. ఎంత ప్రియమైన వస్తువునైనా సమర్పణ చెయ్యాలి.

కర్ణుడు సహజకవచకుండలుడు. ఒకనాడు యింద్రుడు వచ్చి కుండలాలను తనకు దాన మిమ్మని అడిగాడు. కర్ణుడు అంగీకరించాడు కాని దానికి ప్రతి ఫలంగా "శక్తి"ని యిమ్మని యింద్రుణ్ణి కోరాడు. అప్పుడు కర్ణుని దానమహిమ కలుషితం కాలేదా ?

అందువలన ప్రతిఫలం కోరని త్యాగమే అసలుసిసలైన త్యాగం. అదే యుగయుగాలకు కీర్తనీయ మౌతుంది

ప్రతిపదార్థం :- సత్త్వనిధిః= సత్త్వగుణము గల వ్యక్తి త్యాగే= త్యాగము నందు, ప్రతి + ఉపకృతిస్పృహాం= ప్రతిఫల వాంఛను, న కుర్యాత్ = చేయరాదు, కర్ణః= కర్ణుడు, కుండల దానే= కుండలములను దానము చేసినప్పుడు, శక్తియాచ్ఞయా= ఇంద్రుని నుండి శక్తిని యాచించుటచే, కలుషః= కలుషితుడు, అభూత్= అయ్యెను.

అవిస్మృతోపకారః స్యాత్
న కుర్వీత కృతఘ్నతామ్ ।
హత్వోపకారిణం విప్రో
నాడీజంఘు మధశ్చ్యుతః ॥

మహాకవి "కృతఘ్నతను" నిరసిస్తున్నాడు.

ఉపకారాన్ని మరువని ఉదాత్తుడు కృతఘ్నుడుకాడు, కాకూడదు. "కృతం" అంటే చేయబడినది. తనకై చేయబడినదానిని (ఉపకారాన్ని) మరచిపోయేవాడు కృతఘ్నుడు.

ఒక బ్రాహ్మణుడు తనకు ఉపకారం చేసిన నాడీజంఘుణ్ణి చంపి పతితుడయ్యాడు. ఎందువలన ? కృతఘ్నత వలన.

ఎవడా నాడీ జంఘుడు ? ఏమాకథ ?

అనగనగా నాడీజంఘుడనే కొంగ ఉండేది. అది బ్రహ్మకు మిత్రుడు. నాడీజంఘుడు మహాజ్ఞాని.

ఒకనాడు ఒక బ్రాహ్మణుడు మదపుటేనుగు బారి నుండి తప్పించుకొనుటకు పరుగెత్తి పరుగెత్తి ఒక మఱ్ఱిచెట్టు క్రింద

దాక్కున్నాడు. అది నాడీజంఘుని ఆశ్రయం. అలసిపోయి రొప్పుతున్న బ్రాహ్మణుణ్ణి చూసి గౌరవించి భోజనం పెట్టి "నా దగ్గర ధనం లేదు గాని మధువజ్రపురంలో విరూపాక్షుడనే రాక్షసుడు నా మిత్రుడున్నాడు. వాని వద్దకు పోయి ధనము తెచ్చుకో" అని చెప్పి పంపాడు నాడీజంఘుడు.

ఆ విప్రుడక్కడకు పోయి విరూపాక్షుడనే రాక్షసుణ్ణి కలసి నాడీజంఘుని మాటల్ని తెలిపాడు కాని ఆ రాక్షసుడు బ్రాహ్మణుని ముఖకవళికను పరిశీలించి వాడు తుచ్ఛుడని ఊహించి ధనమివ్వదలచుకోలేదు. కాని మిత్రుని మాట తీసివేయులేక ధనమిచ్చి పంపాడు. అతడిచ్చిన ధనమంతయు మోసుకొని తిరిగి నాడీజంఘుని వద్దకు వచ్చి ఆ భారమక్కడ దింపి నిద్రపోయాడు. వాని శ్రమను పోగొట్టుటకు ఆ కొంగ రెక్కలతో విసరి తాను కూడ నిద్రపోయింది ఇంతలో బ్రాహ్మణునికి మెలకువవచ్చింది. నిద్రలో నిమగ్నమైన కొంగను చూసి "అహా! ఇంత బాగుగా బలసిన యీ కొంగ మంచి భోజనమే ఔతుంది" అని నోరూరి నాడీజంఘుణ్ణి చంపాడు.

నాడీజంఘుడు యథాప్రకారం రాకపోవుట వలన మిత్రుడైన విరూపాక్షునికి సందేహం వచ్చింది. తన దూతల్ని పంపి తెలుసుకొని రమ్మన్నాడు వారు వచ్చి కొంగ చచ్చి పడియుండుట చూచి వెళ్ళి రాక్షసునితో చెప్పారు. అతడు ఆగ్రహో

డ్డుపడై బ్రాహ్మణుణ్ణి పట్టి తెచ్చి "తినుమ"ని తన అనుచరుల ముందు పడవేశాడు. కాని వారు కూడ "వీడు కృతఘ్నుడు కాన వీనిని ముట్టము"ని పలికారు

ఇంతలో బ్రహ్మ ప్రత్యక్షమై నాడీజంఘుని బ్రతికించెను. నాడీజంఘుడు లేచి బ్రాహ్మణుని మన్నించవలసిందని దేవతలను ప్రార్థించెను

అదీ నాడీజంఘుని కథ.

ఆ బ్రాహ్మణుడెంత కృతఘ్నుడో తెలుసుకున్నారు కదా!

ప్రతిపదార్థము :- అవిస్మృత + ఉపకారం: = తనకు చేసిన ఉపకారమును మరువనివాడు, స్యాత్ = కావలెను, కృతఘ్నతాం = ఉపకరించిన వానికే అపకారమును తల పెట్టుట, న కుర్వీత = చేయరాదు, విప్రః = బ్రాహ్మణుడు, ఉపకారిణం = తనకు ఉపకారమొనరించిన, నాడీజంఘం = నాడీజంఘుని, హత్వా = చంపి, అధః + చ్యుతః = పతనము చెందెను.

గుణ స్తవేన కుర్వీత
మహతాం మానవర్ధనమ్ ।
హనూమానభవత్ స్తుత్యా
రామకార్యభరక్షమః ॥

ఎంత గొప్పవారు కూడా స్వయంగా కార్యోన్ముఖులు కారు. వారిని ప్రేరేపించాలి. ప్రేరణ ఉంటేనే కార్యసాధన జరుగుతుంది. అందుకే కవి అంటున్నాడు —
"గొప్పవారి గుణాలను కీర్తించుట ద్వారా వారి ఆత్మవిశ్వాసాన్ని పెంపొందింపజేయాలి"

దీనికి ఉదాహరణ హనుమంతుడే వానరులందరూ "సముద్రాన్నెలా దాటాలి? లంకనెలా చేరాలి?" అనే సమస్యలో పడ్డారు. సీతాన్వేషణ కోసం వారి మనస్సులు తల్లడిల్లిపోతున్నై. సముద్రాన్ని దాటాలి లంకను చేరాలి అక్కడ సీత ఉనికిని కనిపెట్టాలి.

అంగదుడు వరుసగా వానరులందర్నీ అడిగాడు- "ఎవడు సముద్రాన్ని దాటగలడు ?" ఎవడూ ముందుకురాలేదు. చివరకు వృద్ధుడైన జాంబవంతుడు హనుమంతుని వంక చూసి "ఇతనే సమర్థుడు" అని వానరులకు తెలిపాడు. ఆ వీరులందరూ హను

మంత్రముగ్ధ స్తోత్రమాలికతో అలంకరించారు. ప్రశంసలతో అభి[illegible]కించారు. అది విని హనుమంతుడు పెంచాడు రామ కార్యసాధనకు విజృంభించాడు.

ప్రతిపదార్థం :- గుణస్తవేన = గుణములను చేత, మహతాం = గొప్పవారి యొక్క, మానవర్ధ విశ్వాసమును పెంపొందించుట, కుర్వీత = చేయుము, స్తుతించె, హనుమాన్ = హనుమంతుడు, రామకార్య రాముని కార్యమును సాధించుట యందు సమర్థుడు, అయ్యెను.

యత్నేన శోషయేద్దోషాన్
న తు తీవ్రవ్రతైస్తనుమ్ ।
తపసా కుంభకర్ణోఽభూత్
నిత్యనిద్రావిచేతనః ॥

ప్రయత్నించి మనలోని దోషాలను రూపుమాపు కోవాలి. కఠోరములైన వ్రతనియమాలచేత శరీరాన్ని శుష్కింపజేస్తే ఏం లాభం ? అలసిసొలసే దేహం ధర్మాన్ని నిర్వహించలేదు.

కుంభకర్ణుడేమయ్యాడో చూడు ....

"కైకసి" అనే రాక్షసికి "విశ్రవసుడ"నే మహర్షికి వలన రావణుడు, కుంభకర్ణుడు, విభీషణుడు జన్మించారు ఒకసారి కుబేరుడు (విశ్రవసునికి "ఇలబిల" అనునామె వలన పుట్టినవాడు) తండ్రిని చూడటానికి వచ్చాడు.

కుంభకర్ణుని వైభవాన్ని చూపి కైకసి తన కుమారులైన రావణాదులతో అన్నది - "నాయనా! మీ సోదరుడెంత వైభవోపేతుడో చూశారా! మీరు కూడ అంతటి వారు కావాలని కోరుకుంటున్నాను".

"తపస్సు చెయ్యండి. వరాలను పొంది వరిష్ఠులు కండు" అని తల్లి యిచ్చిన సలహాప్రకారం ముగ్గురూ గోకర్ణ-ఆశ్రమాన్ని

పూనుకున్నారు. కఠోరంగా తపస్సు చేశారు. బ్రహ్మ ప్రత్యక్షమయ్యాడు. మొదటగా రావణుడు తన నెవరూ వధింపలేకుండు నట్లు వరాన్ని కోరి పొందాడు తర్వాత విభీషణుడు తన కెల్లప్పుడు ధర్మబుద్ధి కలుగునట్లు" వరాన్ని కోరాడు. బ్రహ్మ అనుగ్రహించాడు

ఇక కుంభకర్ణుడు సహజంగానే ప్రమత్తుడగుట వలన, సరస్వతీదేవి సంకల్పము వలననూ "నాకు చాలకాలం నిద్రించాలని ఉంది" అని వరమడిగాడు. విధాత "తథాస్తు" అన్నాడు,

పాపం ! ఆక్షణంలో . తాను చేసిన కఠోరవ్రతనియమాలకు దేహం అలసిపోయి హాయిగా నిద్రపోతే బాగుండుననే కోరిక బలీయమై, గొప్పవరం కోరుకోవాలనే బుద్ధి నశించిపోయింది అందుకే జీవితాంతం కుంభకర్ణుడు నిద్రాదేవి ఒడిలోనే ఆనందాన్ని చవిచూశాడు.

దేహానికి అలపు తెచ్చేటంత కఠోరములైన వ్రతాల కంటె మనస్సును లక్ష్యోన్ముఖం చేసి దేనినైనా సాధించుట మేలు. శరీరం ధర్మసాధనాలన్నింటిలోకి ప్రథమగణ్యం .... ముందు భౌతిక పరిపుష్టిని సంపాదించి పిమ్మట భౌతికేతర లక్ష్య సాధనకు పూనుకోవాలి అది సరైన మార్గం.

అందుకే ఉపనిషత్తులు "నాయమాత్మా బలహీనేన లభ్యతే" అని ఉద్ఘోషించాయి.

ప్రతిపదార్థం :- యత్నేన = ప్రయత్నముచేత, దోషాన్ = తప్పులను, శోషయేత్ = పోగొట్టుకొనవలెను, తు = కాని, తీవ్ర వ్రతైః = కఠోరములైన వ్రతములచేత, తనుం = శరీరమును, న శోషయేత్ = శుష్కింపజేయరాదు, కుంభకర్ణః = కుంభకర్ణుడు, తపసా = తపస్సుచేత, నిత్యనిద్రా విచేతనః = ఎల్లప్పుడు ఉత్సాహము లేనివాడు, అభూత్ = అయ్యెను.

72

హితోపదేశం శ్రుత్వా తు
కుర్వీత చ యథోచితమ్ ।
విదురోక్తమశ్రుత్వా తు
శోచ్యోఽభూత్ కౌరవేశ్వరః ॥

ఎవరైనా హితమును ఉపదేశిస్తే విని ఉచిత రీతిని ఆచరించాలి. అది శ్రేయస్కరం. నీతికోవిదుడైన విదురుడు చెప్పిన మాటల్ని గర్వంతో తిరస్కరించి కౌరవరాజైన సుయోధనుడు పతనం చెందాడు. భారత కథలో చివరలో శోచనీయుడయ్యాడు.

# మరికొన్ని మణులు

ఆతురే వ్యసనే ప్రాప్తే
దుర్భిక్షే శత్రుసంకటే।
రాజద్వారే శ్మశానే చ
యస్తిష్ఠతి స బాంధవః ॥

మనకు బ్రతుకు - బాటలో బంధువులనే పేరుతో చాలమంది తారసపడుతూంటారు. కాని వారిలో ఎంత మందిని బంధువులన వచ్చును ?

దానికి సమాధానమే పై శ్లోకం.

"రోగం వచ్చి మంచాన పడ్డప్పుడు, ఆపదల్లో ఉన్నప్పుడు, దుర్భరదారిద్ర్యంలో, శత్రువుల వలన దుఃఖం ఏర్పడినప్పుడు, రాజుగారి యెదుట సాక్ష్యం చెప్పవలసి వచ్చినప్పుడు, శ్మశానమందును వెంట ఉండే వాడు బంధువు."

అంటే సుఖాల్లోనే గాక కష్టాలు కలిగినప్పుడు కూడా వెంట ఉండి ఉబికే కన్నీటిని తుడిచి జీవనారామంలో నవ్వులు పూయించే ఆత్మీయుడే బంధువు.

ప్రతిపదార్థం:- ఆతురే=రోగము, ప్రాప్తే=ప్రాప్తించగా, వ్యసనే=ఆపద, ప్రాప్తే=లభించగా, దుర్భిక్షే=అన్నము కూడా దొరకని దారిద్ర్యమందు, శత్రుసంకటే = శత్రువుల వలన కలిగిన దుఃఖమందు, రాజద్వారే = రాజద్వార మందు (ఏదైనను అపరాధమును చేసినప్పుడు తన తరపున సాక్ష్యమును రాజెదుట చెప్పవలసి వచ్చినప్పుడు), చ = మరియు, శ్మశానే = శ్మశానమందును, యః = ఎవడు, తిష్ఠతి = ఉండునో (స్థిర చిత్తుడై తోడుగా నిలబడునో), సః = అట్టివాడు, బాంధవః = బంధువు.

పరోక్షే కార్యహన్తారం
ప్రత్యక్షే ప్రియవాదినమ్ ।
వర్జయేత్ తాదృశం మిత్రం
విషకుంభం పయోముఖమ్ ॥

మన ప్రక్కనే తిరుగుతూ మనకు కీడు తలపెట్టే విషనాగు లుంటారు. పొరపాటున వారిని "మిత్రుల"ని భావించి పెనవేసుకు పోతాం. కానీ వారు మిత్రులు కారు. వారు "కుమిత్రులు".

"ప్రత్యక్షంగా ప్రియాన్ని పలుకుతూ, పరోక్షంగా పనుల్ని చెడగొట్టే మిత్రుడు "పయోముఖ విషకుంభం" వంటివాడు. అంటే- పైన పాలనురగ, లోన విషం నిండిన కుండిక వంటివాడు. అట్టి మిత్రుణ్ణి విడచిపెట్టవలెను.

ప్రతిపదార్థం :- పరోక్షే = పరోక్షమందు, కార్యహన్తారం = పనులను చెడగొట్టువానిని, ప్రత్యక్షే = ఎదుట, ప్రియవాదినం= ప్రియముగా పలుకువానిని, పయోముఖం = పైన పాలనురుగు గల, విషకుంభం = విషపుకుండవలెనున్న, తాదృశం అటు వంటి, మిత్రం = మిత్రుని, వర్జయేత్ = విడచిపెట్టవలెను.

అతిరూపేణ వై సీతా
అతిగర్వేణ రావణః ।
అతిదానాత్ బలిః బద్ధః
అతి సర్వత్ర వర్జయేత్ ॥

అతి అంటే "అధికం" లేక "ఎక్కువ" అని అర్థం. ఏ విషయంలోనూ "అతి" అంత మంచిదికాదు. అతి నిద్ర, అతి భోజనం, అతి గర్వం, అతిరూపం - యిలా అతిగుణాలు శ్రేయస్కరాలు కావు మంచితనం కూడా అతిగా వుండకూడదు. పరిమితంగా వుండాలి అతి సౌజన్యం "అసామర్థ్యం" క్రింద పరిగణించబడుతుంది.

అతి సౌందర్యం కలదిగాబట్టి సీతపై మరులుగొని రావణుడు అపహరించాడు. ఆ రావణుడు అతిగర్వం చేతనే అణగారి పోయాడు బలిచక్రవర్తి అతిశయించిన దానగుణం వలన అధఃపాతాళాన్ని చేరాడు అందువలన అన్నింటా "అతి"ని విడిచి పెట్టాలి.

అతి కన్న మితి మిన్న.

లాలయేత్ పంచవర్షాణి
దశవర్షాణి తాడయేత్ ।
ప్రాప్తే తు షోడశే వర్షే
పుత్రం మిత్రవదాచరేత్ ॥

బిడ్డల్ని పెంచటం ఒక కళ. తమ బిడ్డడు పెరిగి పెద్దవాడై సమర్థుడుగా రాణించాలని తల్లిదండ్రులు కలలు కంటారు. గారాబంగా పెంచుతారు. ఆ ముద్దే కొంతమంది బాలుర విషయంలో విచ్చలవిడితనానికి విడిది యిస్తుంది. అందుకే నీతి కారులు మనకొక సలహా యిచ్చారు -

"ఐదేళ్ళ వరకు లాలించాలి. అప్పటినుండి పదేళ్ళ అంటే పదునైదు (15) సంవత్సరాల వరకు కొట్టి అయినా సరే క్రమ శిక్షణను అలవర్చాలి. కాని పదునారవ సంవత్సరంలో అడుగు పెట్టిన నాటి నుండి పుత్రుణ్ణి మిత్రునిగా భావించాలి"

మన స్తత్త్వానికి అనుకూలమైన తీర్పు అది. ఐదేళ్ళ నుండి చుట్టుప్రక్కల నున్న మంచినీ, చెడునీ చూసి విడమర్చి వివే చించుకునే శక్తి కొద్దికొద్దిగా అలవడుతుంది. అందుకే ఆ సమ యంలో క్రమశిక్షణ అవసరం. సన్మార్గం
సమయం అది

పదునారవ యేడు వచ్చేసరికి యుక్తవయస్కుడౌతాడు స్వతంత్రభావములైన భావాలు కేరింతలు కొట్టే వయస్సది. నమస్కారం కంటె పరిశీలనయే రాజ్యమేలే ఈ వది కొబట్టి ఆ వయస్సులో మున్న పుత్రుణ్ణి శాసించి విఫలత పొందటం కంటె నచ్చజెప్పి గౌరవాన్ని కాపాడుకోవటం మేలు

ఆచారః కులమాఖ్యాతి
దేశమాఖ్యాతి భాషణమ్ ।
సంభ్రమః స్నేహమాఖ్యాతి
వపురాఖ్యాతి భోజనమ్ ॥

మానవుని ఆచారము అనగా ప్రవర్తన అతడే కులంలో జన్మించాడో చెపుతుంది అతను మాట్లాడే తీరు అతని దేశాన్ని చెపుతుంది. అతను కనబరిచే ఆదరం లేక ప్రేమ స్నేహాన్ని చెపుతుంది. అతని శరీరము తిండిని చెపుతుంది.

అంటే మానవుని సంస్కారం అతని ఆచారంలో, అతని భాషణలో, అతని శరీర పోషణలోను ప్రతిఫలిస్తుందని తెలుసు కోవాలి.

ప్రతిపదార్థం :- ఆచారః = ఒకని ఆచారము (లేక) ప్రవర్తన, కులం = వానికులమును, ఆఖ్యాతి = తెలియ చెప్పును, భాషణమ్ = మాట్లాడే తీరు, దేశం = దేశమును, అఖ్యాతి = తెలియ జెప్పును, సంభ్రమః = విశేషమైన ఆదరము, స్నేహం = ప్రేమను, ఆఖ్యాతి తెలియ జెప్పును, వపుః = శరీరము, భోజనం - భోజనమును, ఆఖ్యాతి = తెలియ జెప్పును

అర్థనాశం మనస్తాపం
గృహే దుశ్చరితాని చ ।
వంచనం చాపమానం చ
మతిమాన్ న ప్రకాశయేత్ ॥

ధననాశనాన్ని, మనస్సులో రగిలే బాధను, ఇంట్లో జరిగిన చెడునీ, ఇతరులచే తాను మోసగించబడుటను, తనకు కలిగిన అవమానాన్ని తెలివిగల వాడు బయటపెట్టడు. అట్లు చేసినచో సమాజములో వానికి గౌరవము నశించును. అది తెలివిగలవాని జీవన రహస్యం.

ప్రతిపదార్థం :- మతిమాన్ = బుద్ధిశాలి, అర్థనాశం = ధనము నశించిపోవుటను, మనః + తాపం = మనస్సులోని బాధను, గృహే = ఇంటిలోని, దుశ్చరితాని = దుష్టకర్మలను, చ = మరియు వంచనం = మోసమును, అవమానం = అవమానమును, న ప్రకాశయేత్ = తెలియజేయరాదు.

ఉపార్జితానాం విత్తానాం
త్యాగ ఏవ హి రక్షణం ।
తడాగోదర సంస్థానాం
పరివాహ ఇవాంభసాం ॥

ధనం నీరు లాంటిది. అది నిల్వ ఉండకూడదు నిల్వ వలన నీరు చెడిపోవునట్లే ధనం కూడ మానవుని జీవనాన్ని పెడదార్లు పట్టిస్తుంది. అందుకే ఒక ప్రాచీన కవి ఇలా హెచ్చరిస్తున్నాడు.

సంపాదించిన దనానికి త్యాగమే రక్షాకవచం. అంటే త్యాగం వల్లనే ధనం సఫలమై సదా సత్కీర్తిని, శాంతిని చేకూరుస్తుంది. చెరువులందు ఉన్న నీరు ప్రవహించినప్పుడే సార్థకత.

ప్రతిపదార్థం .- త్యాగః ఏవ = త్యాగమే, ఉపార్జితానాం = సంపాదించబడిన, విత్తానాం = ధనమునకు, రక్షణం రక్షణ; తడాగ + ఉదర సంస్థానాం = చెరువుల లోపల నుండు, అంభసాం = నీటికి, పరివాహః ఇవ = ప్రవాహరూపమైన వినియోగమువలె.

పుష్పే గంధః తిలే తైలం  
కాష్ఠే వహ్నిః పయోఘృతం ।  
ఇక్షౌ గుడం తథా దేహే  
పశ్యాత్మానం వివేకతః ॥

అంతటా ఆత్మీయతాభావన ఉత్కృష్టమైనది పరమాత్మ తన దేహమందే ఉన్నాడు అని భావించినప్పుడు భక్తకోటి అక్కడికి ఇక్కడికి పరుగులు తీసి వృథా ప్రయాస పడవలసిన అవసరం ఉండదు. అందుకే ఒక ప్రాచీనకవి తనయందే ఆత్మ భావన ఎంత సులువుగా ఎంతసహజంగా కలగాలో ఈ శ్లోకంలో వివరించాడు.

పువ్వునందు సువాసన, నువ్వులందు నూనె, వంటచెర కులో అగ్ని, పాలలో నెయ్యి, చెరకులో బెల్లం దాగి ఉందని వివేకంతో తెలుసుకొనునట్లే దేహము నందు ఆత్మను భావించ వలెను.

ప్రతిపదార్థం : పుష్పే = పువ్వునందు, గంధః= సువాసన తిలే = నువ్వులందు, తైలం = నూనె, కాష్ఠే = వంట చెరకునందు వహ్నిః = అగ్ని, పయోఘృతం = పాలలో నెయ్యి, ఇక్షౌ = చెరకు గడయందు, గుడం = బెల్లము, తథా = అట్లే, దేహే = దేహము నందు, ఆత్మానం = ఆత్మను, వివేకతః = వివేకముతో, పశ్య = చూడుము.

క్రోధో వైవస్వతో రాజా
తృష్ణా వైతరణీ నదీ ।
విద్యా కామదుఘా ధేనుః
సంతోషో నందనం వనం ॥

క్రోధము యమునివంటిది. తృష్ణ అనగా అనంతమైన కాంక్ష వైతరిణీనదివంటిది. విద్య కామధేనువు వంటిది సంతోషము సాక్షాత్తు గా నందనవనమే.

క్రోధము యమునివలె భయంకరమైనది. అంతులేని కోరికల పరంపర వైతరణీ నదివలె దుఃఖదాయిని. నానాఫలములనిచ్చు విద్య కామధేనువు సంతోషము మానవునికి సుఖశాంతుల నొసగును. అందుకే అది నందనవనము.

ప్రతిపదార్థం :- క్రోధః = తీవ్రమైన కోపము, వైవస్వతః = యముని కుమారుడైన, రాజా = రాజు అనగా యముడు తృష్ణా = అనంతమైన కాంక్ష, వైతరణీ నదీ = భయంకరమైన వైతరణి అను పేరుగల నది. విద్యా = విద్య, కామ దుఘాదేనుః = కోరికలను తీర్చునట్టి ధేనువు. సంతోషః = సంతోషము, నందనం వనం = నందనవనం.

దాతృత్వం ప్రియవక్తృత్వం
ధీరత్వముచితజ్ఞతా ।
అభ్యాసేన న లభ్యంతే
చత్వారః సహజాగుణాః ॥

కొన్ని గుణాలు చూసి నేర్చుకుంటే అలవడతాయి. కాని కొన్ని గుణాలు చూసి నేర్చుకోవటానికి వీలులేనివి. దానం చేయు

టం, ప్రియంగా మాట్లాడటం, ధైర్యం, ఉచితానుచిత జ్ఞానం - ఇవి నాలుగు సహజంగా సిద్ధించే గుణాలు.

ప్రతిపదార్థం :- దాతృత్వం = దానము చేయుట, ప్రియ వక్తృత్వం = ప్రియముగా మాట్లాడుట, ధీరత్వం = ధైర్యము, ఉచితజ్ఞతా = ఔచిత్యము నెరుగుట, అభ్యాసేన = నేర్చుకొనుట ద్వారా, న లభ్యంతే = పొందబడవు, చత్వారః = ఇవి నాలుగు, సహజాః గుణాః = సహజములైన గుణములు.

సత్యం మాతా పితా జ్ఞానం
ధర్మో భ్రాతా దయా సఖా ।
శాంతిః పత్నీ క్షమా పుత్రః
షడేతే మమ బాంధవాః ॥

ఒక మహాజ్ఞాని తన బంధువులను ఇలా పేర్కొంటాడు -

సత్యం నా తల్లి. జ్ఞానం నాతండ్రి. ధర్మం నాసోదరుడు దయ నా స్నేహితుడు. శాంతి నా పత్ని. సహనం నా పుత్రుడు వీరే నా బంధువులు.

ప్రతిపదార్థం :- ఏతే = ఈ, షట్ = ఆరుగురు, మమ = నాయొక్క, బాంధవాః = బంధువులు.

జలబిందు నిపాతేన
క్రమశః పూర్యతే ఘటః ।
స హేతుః సర్వవిద్యానాం
ధర్మస్య చ ధనస్యచ ॥

ఒక్కొక్క నీటిబొట్టు పడి క్రమంగా కుండ నిండుతుంది. అదే రీతిగా విద్యలు, ధర్మం, ధనం వృద్ధి చెందుతాయి. అంటే ఒక్కొక్క అక్షరం కూడబలుక్కుంటూ ప్రారంభించిన విద్యాభ్యాసం ద్వారా సమస్త శాస్త్రాలకు విస్తరిస్తుంది. ఒక్కొక్క పైస కూడగట్టుకుంటూ ప్రారంభించబడిన ధనసంపాదన మహా సంపద అవుతుంది క్రియలన్నింటా జాగ్రత్తతో ఆచరించబడే ధర్మం క్రమంగా అభివృద్ధి చెంది వానిని ధర్మాత్మునిగా తీర్చి దిద్దుతుంది.

ప్రతిపదార్థం :- ఘటః = కుండ, జలబిందు = నీటిబొట్ల యొక్క, నిపాతేన = పతనముచే అనగా పడుటచే, క్రమశః =

క్రమంగా, పూర్యతే = నింపబడును, సః = అది అనగా ఆపద్ధతి సర్వవిద్యానాం = విద్యలన్నింటికి, చ = మరియు, ధర్మస్య = ధర్మమునకు, చ = మరియు, ధనస్య = ధనమునకు, హేతుః = కారణము.

సంతోషః త్రిషు కర్తవ్యః
స్వదారే భోజనే ధనే ।
త్రిషు చైవ న కర్తవ్యః
అధ్యయనే జపదానయోః ॥

మూడు విషయాలలో సంతృప్తి పొందాలి తన భార్య విషయంలో, బోజన విషయంలో, ధన విషయంలో. కాని మరో మూడు విషయాలలో సంతృప్తి తగదు. విద్యను అభ్యసించ టంలో, జపం చేయటంలో, దానం చేయటంలోను అంటె అధ్యయన జప దానాలలో సంతృప్తి చెందితే అభివృద్ధి ఉండదు.

నిత్య విద్యార్థిగా ఉండేవాడు, నిరంతర ధ్యాననిమగ్నుడు, నిత్యదాత అవిచ్ఛిన్నమైన అభివృద్ధిని పొందుతారు.

ప్రతిపదార్థం :- సంతోషః = సంతోషము, త్రిషు = మూడింట అనగా మూడే విషయాలలో, కర్తవ్యః = చేయదగినది అనగా పొందదగినది. స్వదారే = తన భార్యయందు, భోజనే = భోజనమునందు, ధనే = ధనమునందును, చ = మరియు, త్రిషు = మూడు విషయాలలో, నైవ కర్తవ్యః = సంతృప్తి పొందరాదు. అధ్యయనే = విద్యను అభ్యసించుటలో, జపదానయోః = జపమునందు మరియు దానమునందు.

గుణైః సర్వజ్ఞతుల్యోఽపి
సీదత్యేకో నిరాశ్రయః ।
అనర్ఘమపి మాణిక్యం
హేమాశ్రయ మపేక్షతే ॥

గుణములందు సర్వజ్ఞునితో అనగా ఈశ్వరునితో సమానుడైనప్పటికి ఆశ్రయము లేనిదే కష్టాలపాలగును అనగా రాణించలేడు. అమూల్యమైన మాణిక్యమైనను బంగారమునాశ్రయించి శోభించును కదా !

ఆశ్రయం లేనిదే గుణాలన్నీ మరుగున పడిపోవును. అందుకే కవి గుణవంతులను మంచి ఆశ్రయమును చూసుకొమ్మని సంఘంలో చక్కగా రాణించమని బోధించాడు.

ప్రతిపదార్థం :- గుణైః = గుణములచేత, సర్వజ్ఞ తుల్యః + అపి = ఈశ్వరునితో సమానుడైనప్పటికి, నిరాశ్రయః = ఆశ్రయము లేని, ఏకః = ఒకడు, సీదతి = కష్టాలపాలగును, అనర్ఘం అపి = అమూల్యమైనప్పటికి, మాణిక్యం = మణి, హేమ + ఆశ్రయం = బంగారము యొక్క ఆశ్రయమును, అపేక్షతే = కోరుకొనును

సంసారతాప దగ్ధానాం
త్రయో విశ్రాన్తిహేతవః ।
అపత్యం చ కలత్రం చ
సతాం సంగతిరేవ చ ॥

సంసారం ఎడతెగని సుఖదుఃఖాల వాహిని "సృ"గతౌ అనే ధాతువునుండి ఉద్భవించింది సారశబ్దం. "సమ్యగ్" అనే అర్థాన్నిచ్చే ఉపసర్గయైన "సం"తో కూడిన సారశబ్దం "ఎడతెగక

సాగిపోయేది" అనే అర్థాన్ని యిస్తుంది అందులో సుఖాలు న్నాయి దుఃఖాలూ ఉన్నాయి.

ఆ సంసారం వల్ల కలిగే దుఃఖాల సెగల్లో వాడిన మనస్సులకి మళ్ళీ పరిమళాన్ని అద్దేవి మూడు. అవి-భార్య, సంతానం, సజ్జన సాంగత్యం.

ప్రతిపదార్థం :- సంసారతాపదగ్ధానాం = సంసార మనెడు తాపముచే దగ్ధులైన వారికి, విశ్రాన్తిహేతవః = విశ్రాంతి కారణములు, త్రయః = మూడు, అపత్యం = సంతానము, చ = మరియు, కలత్రం = భార్య, చ = మరియు, సతాం = మంచి వారి యొక్క, సంగతిః ఏవ = సాంగత్యమే అనగా స్నేహమే!

అధమాః ధనమిచ్ఛన్తి
ధనం మానం చ మధ్యమాః ।
ఉత్తమాః మానమిచ్ఛన్తి
మానో హి మహతాం ధనమ్ ॥

అధములు ధనాన్ని కోరుకుంటారు. వారి జీవితలక్ష్యం ధన సంపాదన. మధ్యములు ధనాన్ని మాత్రమేకాక మానాన్ని కూడ

కోరుకుంటారు. ఉత్తములు మాత్రం మానాన్ని ప్రధానంగా కోరుకుంటారు. ఎందుకంటే మహనీయులకు మానమే ధనం కదా!

దీపో భక్షయతే ధ్వాన్తం
కజ్జలం చ ప్రసూయతే ।
యదన్నం భక్ష్యతే నిత్యం
జాయతే తాదృశీ ప్రజా ॥

దీపం చీకటిని మింగి నల్లని మసిని బైటకు క్రక్కుతుంది. అంతే కదా.... ఎట్టి అన్నాన్ని నిత్యం భుజిస్తారో వారికట్టి సంతానమే కలుగుతుంది.

అంటే సత్త్వగుణ పోషకములైన దినుసులు గల ఆహారం సాత్త్వికభావనాప్రేరకమై తద్వారా సత్సంతతికి కారణమౌతుంది. రజః - తమోగుణదాయకమైన ఆహారం క్రౌర్య - కౌటిల్య హేతువై దుష్టసంతతిని ఉత్పాదిస్తుంది.

అందుకే ఉపనిషత్తులు "అన్నాద్ధ్యేవ ఖల్విమాని భూతాని జాయన్తే" అన్నాయి. "అన్నం నుండియే ఈ సమస్త ప్రాణి కోటి జన్మిస్తోంది."

ప్రతిపదార్థం :- దీపః = దీపము, ధ్వాన్తం = చీకటిని, భుక్తే = తినును (తనలో లీనము చేసుకొనునని అర్థము), మరియు, కజ్జలం = కాటుకను అనగా మసిని, ప్రసూతే = వెడలగ్రక్కును, నిత్యం = ఎల్లప్పుడు, యత్ = ఎటు రి, అన్నం = అన్నము, భక్ష్యతే = తినబడునో, తాదృశీ = వంటి, ప్రజా = సంతానము, జాయతే = జన్మించును.

యస్య నాస్తి స్వయం ప్రజ్ఞా
శాస్త్రం తస్య కరోతి కిమ్ ।
లోచనాభ్యాం విహీనస్య
దర్పణః కిం కరిష్యతి ॥

"స్వయంప్రజ్ఞ" లేని వానికి శాస్త్రమేమి చేయగలదు? గా అట్టివారికి శాస్త్ర పరిశ్రమ వ్యర్థం. కన్నులు లేనివానికి మేమి చేయగలదు? అనగా గ్రుడ్డివానికి అద్దంతో ఏమి ం ?

"స్వయం ప్రజ్ఞ" అంటే పరుల బోధను అపేక్షించకుండ స్వయంగా శాస్త్రమును అవగాహన చేసుకొనగల ధీశక్తి.

ప్రతిపదార్థం :- యస్య = ఎవనికి, స్వయంప్రజ్ఞా స్వయంప్రజ్ఞ, న + అస్తి = ఉండదో, తస్య = వాని శాస్త్రం = శాస్త్రము, కిం కరోతి = ఏమి చేయును ? లోచనాభ్యాం విహీనస్య = కన్నులు లేనివానికి, దర్పణః = అద్దము, కిం కరిష్యతి = ఏమి చేయగలదు ?

పృథివ్యాం త్రీణి రత్నాని
జలమన్నం సుభాషితమ్ ।
మూఢైః పాషాణఖండేషు
రత్నసంజ్ఞాఽభిధీయతే ॥

ఈ భూమిపైన మూడు రత్నాలున్నాయి - నీరు, అన్నము సుభాషితము కాని మూర్ఖులు వట్టి రాళ్ళముక్కల్ని రత్నాలుగా పరిగణిస్తారు

ఇదొక చమత్కారం. "రత్నం" అంటే శ్రేష్ఠమైనది అర్థం. బ్రతకటానికి నీరు, అన్నం అవసరం. బతుకుని వెలుగు రాశిగా మూర్చుకోటానికి సుభాషితం అవసరం. అందుకే అత్యంత శ్రేష్ఠములైన ఆ మూడే రత్నాలు గాని రాళ్ళముక్కల రత్నాలా ? అని నీతికారుడు చమత్కరించాడు.

93

ప్రతిపదార్థం :- పృథివ్యాం = భూమిపైన, త్రీణి = మూడు, రత్నాని = రత్నములు, జలం = నీరు, అన్నం = ఆహారం, సుభాషితం = మంచిమాట, మూఢైః = మూర్ఖుల చేత, పాషాణఖండేషు = రాతి ముక్కల యందు, రత్నసంజ్ఞా = రత్నములనెడు పేరు, అభిధీయతే = చెప్పబడుచున్నది

94

సత్యేన ధార్యతే పృథ్వీ
సత్యేన తపతే రవిః ।
సత్యేన వాతి వాయుశ్చ
సర్వం సత్యే ప్రతిష్ఠితమ్ ॥

సత్యం వల్లనే యీ భూమి యిలా స్థిరంగా సత్యం వల్లనే సూర్యుడు ప్రకాశిస్తున్నాడు. సత్యం వాయువు వీస్తోంది. సమస్తవస్తు సంతతి సత్యమందే మైంది. ఇది సత్యమహిమ.

